ఆంధ్ర సచిత్ర వార పత్రిక

27, సెప్టెంబర్-
3, అక్టోంబర్, '85
రు. 2-50



రీగన్ చేత జిలేబీ తినిపించిన ఆంధ్రు

కొత్త సీరియల్
# కాంచనసౌధం
ప్రారంభం!

# ఇంటిల్లిపాదినీ అలరించే ఆంధ్రపత్రిక ప్రచురణలు!

ఆంధ్రపత్రిక

పాక్ నుంచి అణ్వస్త్ర ప్రమాదం ఎదుర్కోడానికి భారత్ సన్నాహం

పంజాబ్‌లో ఎన్నికలపై ఆగస్టు 15 లోగా నివేదిక

ఉగ్రవాదం అణచివేత: రాజ్యసభలో మంత్రి హామీ

ప్రకృతి వైపరీత్యాలలో బాధిత ప్రజలకు









## చందాదారులుగా చేరండి!

వివరాలకు:

★ సర్క్యులేషన్ మేనేజరు
ఆంధ్రపత్రిక
గాంధినగర్
విజయవాడ–520003
ఫోన్ : 61247

★ సర్క్యులేషన్ మేనేజరు
ఆంధ్రపత్రిక
బషీర్‌బాగ్,
హైదరాబాదు–500029
ఫోన్ : 36992

భారతి

సాహిత్య మాసపత్రిక



# ప్రెస్టీజ్
# ప్రెషర్ పాన్

**దీనితో వండిన భోజనం తింటే ఎంత సంతృప్తికలుగుతుందో**
**దీనితో వండడం కూడా అంత సంతృప్తికరంగాను వుంటుంది!**



వేపుడు



హెచ్చు వేపుడు



సాచ్



ప్రెషర్ కుక్



బిర్యానీని చాకచక్యంతో వండండి లేదా గ్రుడ్డును వేగంగా వేపండి. లేదా పూరీని చక్కగా పొంగించండి మరి కూరను చకచక తయారుచేయండి అన్నీ నిమిషాలమీద ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ అంతటి బహుళ ప్రయోజనకారి అన్నమాట అది అంత వాటంగా, వసతిగా వుంటుంది దీనిలో మీరు వేపుడు, హెచ్చు వేపుడు, దోరవేపుడు మరియు ప్రెషర్ కుకింగ్ చేయవచ్చు

ఒక్క ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మాత్రమే నూటికి నూరు పాళ్ళ భద్రతను సమకూర్చగల అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టంను కలిగియున్నది

ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ మీవద్ద వుండివుంటే, మూత లేకుండా దీనిని కొని ఎక్కువగా సొమ్ము ఆదాచేసుకోండి లేదా సొంత మూత కలదానిని కొనండి ఈ ప్రెషర్ పాన్ మీకోసమే మరి.

Prestige
PRESSURE
PAN ©

TTK తయారీ.

MAA (S) PP1B TEL 84

## ముఖచిత్రం

దర్శక సింహాసనం ను అదిరోహించిన మహామనిషి కృష్ణ ముఖచిత్రము ఆగస్ట్ 9-15 పత్రికకు చాలా అందాన్ని చేకూర్చింది

-ఏ యస్ ప్రసాద్ నూతిమడుగు

## సీరియల్స్

9-15 ఆగస్టు '85న వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'ప్రతిభ కొత్త సీరియల్ ప్రారంభము నాకు చాల నచ్చింది

బిల్లాన అప్పారావు
చింతలపాలెం

★ ★ ★

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ గారి కొత్త సీరియల్ ప్రతిభ ప్రతిభావంతంగా ఉంది అదిలో నే శ్రీ శివప్రసాద్ గారి సీరియల్స్‌లో శైలి ఉదాత్తంగా ఉండి చదువరులను ఇట్టే ఆకట్టుకుంటుంది

ఆకెళ్ళ సుబ్బారావు కందికుప్ప

★ ★ ★

ప్రతిభ సీరియల్ ముదిగొండ శివప్రసాద్ గారికి నాట్యశాస్త్రంలో వున్న ప్రతిభను ప్రస్ఫుటం చేస్తోంది పాఠకులకు మానసికానందంతో పాటు, విజ్ఞానాన్ని పుష్కలంగా అందించే 'ప్రతిభ' సీరియల్ మీరు ప్రచురించడం కారు చీకటిలో కాంతిరేఖ లాంటిదే చక్కని వర్ణనలతో మాటలకందని అనుభూతినందిస్తూ, ఉదాత్తమైన పాత్రలను కళ్ళ ముందు ప్రతిష్ఠింపచేసి రసగంగలో ముంచెత్తే రచయిత శివప్రసాద్ గారికి నా హృదయపూర్వక కళాభివందనాలు

ఎ రాధాకృష్ణారెడ్డి
ఆళ్ళగడ్డ

## కథలు

నటి 'రజని' ముఖచిత్రముతో వెలువడిన పత్రికలో 'విముక్తి' కథ చాలా సహజంగా, వాస్తవికంగా ఉన్నది రచయిత శ్రీ చందక రాజారామ మోహన్‌రావు గారు, మన గవర్నమెంటు హాస్పిటల్స్‌ను బాగా స్టడీ చేశారు

పి నాగేంద్రప్రసాద్ కార్వార్




## న్యూఢిల్లీ లేఖ

డా జయదుబాషిగారి న్యూఢిల్లీ లేఖ చక్కని విమర్శలతో సగటు మనిషి యొక్క ఆలోచనలను తట్టి లేపుతుంది వారి లేఖలను నేను తప్పనిసరిగా చదువుతాను కాని దురదృష్టవశాత్తు ఒక విషయంలో డా దుబాషి గార్ని మెచ్చుకొనలేక పోతున్నాను

ఆంధ్ర సచిత్రవారపత్రికలోని 24-30 మే 1985 మన శత్రువులెవరో మనకే తెలియదు అన్న శీర్షికలో దుబాషిగారు పంజాబు సమస్య అంతర్జాతీయ పరిణామాలు ఇంక చాలా విషయాలు చక్కగా వ్రాసారు కాని చివరిలో ఆయనగారు ఒక తక్కువ స్థాయి రాజకీయ నాయకుడిలాగా మనం హిందువులం అనే పదాన్ని ఉపయోగించడం సబబుగా లేదు ఆ పదానికి బదులు మనం భారతీయులం అని ఉపయోగించినట్లైతే సబావుగా ఉండేది

జయదుబాషిగారి లాంటి మేధావులు సహితం ఈ విధంగా వేరే మతాలవార్ని వేరుచేసి మాటలాడటం చాల దురదృష్టకరం మొదట మనం భారతీయులం ఆ తరువాతే మిగతావి

ప్రస్తుతం దేశంలో వున్న ముస్లింలు, క్రైస్తవులు ఎలా వచ్చారు అని ఆలోచిస్తే సంఘం వారిని చిన్నచూపు చూడటం వలన, సంఘం వారిని ఒంటరి వాళ్ళను చేసి చూడటం వలన (హరిజనులు, బలహీన వర్గాలు ఆ మతాలని స్వీకరించారు) డా అంబేద్కర్ గారిని ఒక దృష్టాంతంగా తీసుకొనవచ్చును మనకు స్వాతంత్ర్యం వచ్చాకా కూడా కొన్ని వర్గాల ప్రజలని, సమాజం నుండి దూరంచేసి మాటలాడటం నిజంగా మనదేశం చేసుకున్న పాపం యేమోఅనిపిస్తుంది

సరెళ్ళ రవికుమార్, హైదరాబాదు □



ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

శుక్రవారం 27 సెప్టెంబరు-3 అక్టోబరు 85
శ్రీక్రోధన నామ సం బాద్రపద శు చతుర్థశి
సంపుటము 78 సంచిక 3

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాందినగరం విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం
నటి సంయుక్త
(ఫోటో జి కె నరసింహం)

# సరైన నాయకత్వం ఉంటేనే మార్పు సాధ్యం?

2001వ సంవత్సరానికి భారతదేశం ఎ విధంగా ఉంటుంది? తరచూ ఈ ప్రశ్న ముఖ్యంగా పత్రికల సంపాదకులు మమ్మల్ని అడుగుతూ ఉంటారు వారు మామూలు శీర్షికలతో విసుగెత్తిపోయిన తమ పాఠకుల కోసం మమ్మల్ని ఈ ప్రశ్న అడుగుతూ ఉంటారు నెలకొకసారి నాకు ఇలాంటి ప్రశ్నాపత్రం ఒకటి అందుతుంది సాధారణంగా నాకు తెలీదు అనే రిమార్కుతో వాటిని తిప్పి పంపిస్తూ ఉంటాను అయితే అది మోసమే ఆ సంగతి మనకి తెలుసు కనీసం తెలుసుకోవాల్సి ఉంది అసలు ఏమైనా జరగవచ్చు జరగక పోవచ్చు భవిష్యత్తుకి సంబంధించిన ఈ విషయంలో నిజానికి మనం చీకటిలో తడుముకులాడుకుంటున్నామా అనే భావం నాకు కలుగుతూ ఉంటుంది

1970కి 1985కి ఎంత భేదం ఉందో 1985కి 2001కి అంతే తేడా ఉంటుంది ఆలోచించి చూస్తే అసలు ఎ భేదం లేదు అప్పుడు బంగ్లాదేశ్ వ్యవహారానికి కొంచం ముందు శ్రీమతి ఇందిరా గాంధి అధికారం ఉచ్ఛస్థితిలో ఉన్నది నాకు గుర్తున్నంత వరకూ 1970 సంవత్సరంలో ధరలు కూడా ఇప్పుడున్న వాటిలో నాలుగవ వంతు ఉండేవి పది రూపాయలు తీసుకుని మార్కెట్‌కి వెళితే ఎన్నో సరకులతో ఇంటికి తిరిగి వచ్చేవాళ్లం ఇప్పుడు అలా కాదు అయితే ఒక్క ధనవంతుల విషయంలో తప్ప పరిస్థితులలో ఏం పెద్ద మార్పు లేదు వాళ్ల పరిస్థితి ఇంతకుముందు కంటే చాలా మెరుగుగా ఉంది వాళ్లలో చాలా మంది ఇప్పుడు ఎయిర్ కండిషన్డ్ కార్లలో తిరుగు తున్నారు అయిదు నక్షత్రాల హోటళ్లలో భోంచేస్తున్నారు తీరిక సమయాలని విదేశాలలో గడుపుతున్నారు పదిహేను సంవత్సరాల క్రిందట కొన్ని మాత్రమే విదేశీ కార్లు ఉండేవి దేశం మొత్తం మీద అరడజనుకి మించి అయిదు నక్షత్రాల హోటళ్లు లేవు రోజుకి 50 డాలర్లతో వాణిజ్యవేత్తలు మాత్రమే విదేశాలకు వెళ్ళేవారు ఈ రోజుల్లో రాజకీయవేత్తలు కూడ తమ నడుమునొప్పికి చికిత్సకోసం కూడా విదేశాలకు వెళుతున్నారు వాళ్లలో కొందరు దొంగ పాస్‌పోర్టులతో తమ ఉంపుడుగత్తెలని కూడా తమతో పాటు విదేశాలకు తీసుకు వెళుతున్నారు

మనకి సంబంధించినంత వరకూ దేశంలో పెద్ద మార్పేమి జరుగలేదు మనలో చాల మంది ఇంకా రైళ్లలోనే ప్రయాణం చేస్తున్నాం పాల డిపోలలోనే పాలు కొంటున్నాం ఉద్యోగాలకు అసౌకర్యంగా ఉండే బస్సులలో వెళుతున్నాం అయితే మనం టి వి లు చూస్తున్నాం ఇంతకూ అందులో చూపించేది గొప్పవారి అంత్యక్రియలు ముఖ్యంగా తుపాకి కాల్పులతో చనిపోయిన వారి అంతిమ యాత్రలు తరచుగా చూస్తున్నాం ఎన్ని మార్పులు వస్తాయన్నది పదిహేను సంవత్సరాల క్రితం ఎవరు చూసారు? అలాగే రానున్న పదిహేను సంవత్సరాలలో ఎన్ని మార్పులు వస్తాయో ఎవరికి తెలుసు అంతర్యుద్ధాలు జరగవచ్చు విప్లవం రావచ్చు అది కూడా మన పాలక వర్గం ముచ్చటించే విప్లవం లాంటిది కాదు సాయుధ విప్లవం రావచ్చు వ్యక్తులను బట్టి స్థలాలను బట్టి ఆ పోరాటం తుపాకులతో జరగవచ్చు లేదా మోర్టార్లని ఉపయోగించవచ్చు లేకపోతే ధనుర్బాణాలతో జరగవచ్చు యుద్ధాలు విప్లవాలు జరగవని నేను గట్టిగా చెప్పలేను రానున్న భయోత్పాతానికి ఇంతవరకు మనం చూసింది కేవలం సూచన వంటిది మాత్రమే

భారతదేశంలో ఇప్పుడు ఒక కొత్త రాజకీయ వర్గం వ్యాపార వర్గం మనకి కనిపిస్తున్నాయి




ముఖ్యంగా ఇవి రెండూ వారాత్తుగా శక్తివంతమైనవిగా ఆర్థికంగా పెద్ద పట్టణాలలో అభివృద్ధి చెందాయి భారత దేశానికి ఆయువు పట్టయిన వ్యవసాయ రంగంతో వీటికి ఎమాత్రం సంబంధం లేదు మొదటితరం రాజకీయ వేత్తలు వ్యాపారవేత్తలు వేరుగా ఉండేవారు నెహ్రూ ఒక సంపన్నుడి కుమారుడు కాని పల్లెలతో సంబంధాలు ఉన్న తరానికి ఒక తరం తర్వాతి వారు గాంధి చివరిదాకా గ్రామాలతో సంబంధాలు నిలుపుకునే ఉన్నారు గ్రామ స్థాయినించే ఆయన తమ కార్యక్రమాలన్నిటిని నిర్వహించారు గతంలో ఓసారి ఘన్ శ్యామ్ దాస్ బిర్లాతో ఒక సాయంత్రం గడిపాను అప్పుడు ఆయనచేత తన స్వీయ చరిత్ర రాయించడానికి ఒప్పించాలని ఎంతో ప్రయత్నం చేసాను కాని ఆయన రాస్తాననిగాని రాయననిగానీ జవాబియ్యకుండా తన చిన్ననాటి విషయాలు ముచ్చటిస్తూ గడిపారు సమాజానికి ఉపయోగకరమైన శారీరక శ్రమ ప్రజాసేవ వంటి సుదీర్ఘ సాంప్రదాయం కలిగినది ఈ వర్గం

ఈనాడు మనకున్న వారు నాయకులు కాదు మేనేజర్లు జి డి బిర్లా మనుమడు అనేక సంస్థలని నడుపుతూ ఉండవచ్చు కాని ఆయన ఎప్పుడైనా తమ ఫ్యాక్టరీలను సందర్శించారా? తన ఎ సి కార్యాలయాలలో పని చేసే వారిపేర్లు ఆయనకు గుర్తుంటాయా? అని నా అనుమానం ఆయన తమ వాటాదారులకి ధనాన్ని ఆర్జించి పెట్టే మేనేజరు కావచ్చు గానీ వారి తాతలా నాయకుడు కారు శ్రీ రాజీవ్ గాంధి వంటివారు ప్రాతినిధ్యం వహించే రాజకీయ తరం సంగతి కూడా అలాగే ఉంది వీరు ఎంతసేపటికి ప్రజాసేవ చేద్దామనే సాంప్రదాయం లేకుండా రాజకీయ వ్యాపారాలను తమ ప్రతిష్ఠని పెంచుకునే సాధనాలుగా ఉపయోగిస్తున్నారు యువ బిర్లా లేదా యువ సింఘానియా వ్యాపార పరంగా ఎన్ని విదేశీ సంస్థలతో సంబంధాలు కలిగి ఉన్నారన్న దానిపై వారి ప్రతిష్ఠని అంచనా వేస్తారు అలాగే రాజీవ్ గాంధి టి వి తెర ముందు కూర్చుని ఎన్ని ఒప్పందాలపై సంతకాలు చేస్తున్నారన్న దానిపై ఆయన యొక్క కీర్తి ప్రతిష్ఠలని అంచనా వేస్తున్నారు ఒప్పందాలపై సంతకం చేస్తూ టి వి తెరపై కనపడటం వలన తమ ప్రతిష్ఠ ఎంతవరకు

ఆంధ్ర పత్రిక పాఠకులక్కి చక్కటి అవకాశం!




వధూవరుల సమాచారము ఉచితంగా
ప్రతి బుధవారం ప్రకటిస్తాము.
సమాచారం పంపేవారు
ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అయినా 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరిని కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి నెల రోజుల్లోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని త్రిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనను ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధమైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపరాదను.

★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తి చేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ప్రకటన వచ్చినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక జోడీ ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

**కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను**

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... .... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటుసంతకం.......................








## న్యూఢిల్లీ లేఖ

పెరిగిందనే విషయమే వాళ్లకి ముఖ్యం ఈ కొత్త వర్గం వారిలో నేను గమనించింది ఎమిటంటే వారు జాతి లేదా దేశం ఉన్నాయనే స్పృహ లేకుండా వ్యక్తిగత విషయాలకే ప్రాదాన్యం ఇస్తున్నారు ఈ కొత్తవర్గం దేశాన్ని తక్కువ కాలంలో ఎక్కువ లాబాలు గడించే ఫ్యాక్టరిగానో లేక ప్రైవేటు సంస్థగానో బావిస్తున్నారు ఈ వర్గం ఇరవై ఒకటో శతాబ్దం గురించి మాట్లాడటమంటే అది వాళ్ల ప్రతిష్టని పెంచుకోవడానికే అసలు వీరు వచ్చే ఎన్నికల తర్వాత దేశం ఎలా ఉంటుందో ఊహించగలరా అని నా అనుమానం

ఈ విదంగా ప్రతి విషయాన్ని వ్యక్తిగత విజయంగా చూడటమే నాకు బాద కలిగిస్తోంది 75 కోట్ల మంది ప్రజలు నివసించే ఈ పెద్ద దేశంలో వ్యక్తిగత విజయాలకి అర్థం లేదు ఈ విశాల బారత దేశంలో అతి చిన్నదైన ఈ వర్గానికి వ్యక్తిగత విజయం ప్రతిష్టని పెంచుకోడం అనే బావన మౌలికంగా అమెరికా వారినుంచి సంక్రమించింది విజయం సాదించిన వ్యక్తి తనతో కొన్ని వందల మందిని వృద్ధిలోకి తీసుకు రాగలడు బారత దేశంలో కొన్ని వేల మందికి జీవన బృతిని కలుగ జేయటానికి తాతాలకి వంద సంవత్సరాలు పట్టింది అంటే ఈ లెక్కన వారు ప్రతి సంవత్సరానికి రెండు లేదా మూడు వందల మంది చొప్పున జీవనబృతిని కల్పించ గలిగారు ఈ పద్ధతిలో బారత దేశంలో సమస్యలు పరిష్కరించలేము వ్యక్తిగతమైన సంపదకన్నా సామాజిక ప్రగతికి ప్రాముఖ్యత జాతి మొత్తానికి మేలు చేసే వ్యవస్థ కావాలి అందుకోసం నాయకులు కావాలి కానీ మెటల్ బాక్స్ లేక ఇండియన్ ఎయిర్ లైన్స్ లేదా జాన్సన్ అండ్ నికల్సన్ వంటి కంపెనీల మేనేజర్లు కాదు మేనేజర్లు పనిని సరిగా చేయగలరు కానీ నాయకులు సరి అయిన పనిని చేస్తారు సరి అయిన మార్గంలో ఆలోచించి సరి అయిన పనులు చేయగల నాయకులు లేనంతకాలం టి వి తెరలపై ఎన్ని చూపించినా ఇప్పటికీ 2001వ సంవత్సరానికి తేడా ఏమి ఉండదు □

# రీగన్‌చేత జిలేబీ తినిపించిన ఆంధ్రుడు!



ఎన్నోసార్లు టెలిఫోన్ మీద భోజనాలకి కావలసిన నిర్ణయాలు తీసుకోవలసి వస్తూ ఉంటుంది!

ఎయిర్ ఇండియాలో ఆయన పేరు ఎస్. ఎన్. బక్షి. తెలుగువారికి ఆయన వేములకొండ సత్యనారాయణ బక్షి. మరి ఆయన ఏ ఊరు వారు? కాశ్మీరూ కాదు, పంజాబూ కాదు - విజయనగరం!

"మాది శ్రోత్రియ బ్రాహ్మణ వంశం" అని బక్షిగారే అంటారు. తండ్రిగారు శ్రీ సీతారామ బక్షి గొప్ప సంగీత విద్వాంసులు, చిత్రకారులు. వారి వంశానికి విజయనగరంలోనే ఈ బిరుదు లభించింది.

ఎమ్. ఎ., బి. ఎల్. చదివి స. నా. బ. గారు కి. శే. డి. నరసరాజు గారి వద్ద అదే వృత్తిలో చేరుదామనుకుని ఎయిర్ ఇండియా సంస్థలో (అప్పటికే నాలుగంకెల జీతం కల) ఉద్యోగం దొరకటంతో బొంబాయి వెళ్ళిపోయారు. వెళ్ళిపోయారంటే అక్కడ ఉంటున్నారని కాదు. విమానాల కంపెనీలో పనిచేసేవారి స్థిరనివాసం ఎక్కడ అని అనగలము? ఆయన కార్యాలయం బొంబాయి. పనిచేసే స్థలం పశ్చిమజర్మనీలోని ఫ్రాంక్‌ఫర్ట్. సొంత ఇల్లు విశాఖపట్నం. (ఈ మధ్యనే గృహప్రవేశం చేసుకున్నారు.)

ఫ్రాంక్‌ఫర్ట్‌లో ఉంటూ ఈ భూగోళం మీది వివిధ దేశాలకి వెళ్ళి వస్తూ ఉంటారు. అంతేకాదు, ఎయిర్ ఇండియా విమానంలో ప్రయాణం చేసే లక్షలాది ప్రయాణీకులని రుచికరమైన వంటకాలతో సంతోషపెడుతూ ఉంటారు!

ఆ మధ్య శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆఫ్రికా వెడితే స. నా. బ. గారే భోజనాల పర్యవేక్షణ కోసం కూడా వెళ్లారు. శ్రీమతి ఇందిరాగాంధి అమెరికా వెళ్ళినప్పుడు కూడా ఈయనే వెంట వెళ్లారు.

అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్ చేత జిలేబీలు తినిపించారు వేములకొండవారు. అ. అ. భోజనాన్ని పర్యవేక్షించే వ్యక్తి (షెఫ్ అనవచ్చునా?!) జిలేబీలని విరిచి చూసి లోపలికి "జీరా" ఎలాగ వెళ్ళిందా, అని ఆశ్చర్యపోయాడుట (పాతకాలపు నవాబులు ఎవరో పూర్వం బూరెని విరిచి చూసి అబ్బురపడినట్టు!)

"వంట కూడా 64 కళలలోనూ ఒకటి కదా?" అంటారు బక్షిగారు. అయితే, ఈ కళని ఆయన ఫలానా వారి వద్ద అభ్యసించలేదు! ప్రపంచంలో ఎన్నో చోట్ల ఎన్నో రకాల వంటలని చూసి ఎంతో నేర్చుకున్నారు ఆయన ..." ఆధునిక ప్రపంచంలో సాంకేతిక విజ్ఞాన వినియోగం పెరిగిపోతున్న కొద్దీ చాలా విషయాలు తెలుసుకున్నాను. చూసి నేర్చుకోవటం చాలదని, సెలవు పెట్టి, నా సొంత ఖర్చుమీద అమెరికాలో పోషక- ఆహారానికి సంబంధించిన (న్యూట్రిషన్) విద్యని అభ్యసించాను. ఇప్పటి రోజులలో ఇది ఒక కళ మాత్రమే కాదు - శాస్త్రం కూడా!" అంటారు శ్రీ సత్యనారాయణ బక్షి.

కొత్త ఢిల్లీలోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సయిన్సెస్‌లో, బొంబాయిలోని జస్లోక్ ఆసుపత్రిలోనూ ఆయన పథ్యం భోజనాలని గురించి శిక్షణ - ఉపన్యాసాలు ఇచ్చారు. వైద్యనిపుణులని మెప్పించారు.

పారిస్‌లో "మాక్సిమ్స్" రెస్టారెంట్ సుప్రసిద్ధమయినది. ఇక్కడ తినటమే ఒక గొప్ప అనుకుంటే వండటం ఇంకా గొప్ప - పారిస్‌లో "గాంధీ" సినిమా విడుదల అయినప్పుడు కొందరు ప్రముఖులకి భారతీయ శాకాహార భోజనం ఏర్పాటుచేశారు నిర్మాతలు. ఎక్కడ? మాక్సిమ్స్‌లోనే! అంతేకాదు, ఫ్రాంక్‌ఫర్ట్‌లో ఉన్న శ్రీ ఎస్. ఎన్. బక్షిగారిని పిలిచి ఆయనచేత చేయించారు ...

"మాక్సిమ్స్" రెస్టారెంట్ ప్రధాన పాక ప్రవీణుడు (షెఫ్) భోజనాన్ని తిని మెచ్చుకుని స. నా. బ. గారికి ఒక ప్రశంసా పత్రాన్ని కూడా ఇచ్చారు!

రిలయన్స్ సంస్థ అధిపతి శ్రీ అంబానీ ఒకసారి ఒక తాలిమ్‌ఖానాలో బక్షిగారిని కలుసుకుని "నూనెలో వేయించని పెరుగు గారెలు కావాలి ఎలాగ?" అని అడిగారు. వెంటనే ఆలోచించి, ప్రయోగాలు చేసి వాటిని తయారుచేశారు స. నా. బ. గారు!

(ఎలాగో వేరే వివరించాలి! ఇక్కడ వీలుకాదు!)

ఇంత పాకశాస్త్ర ప్రవీణుడయినప్పటికీ శ్రీ వేములకొండ సత్యనారాయణ బక్షికి తమ స్వగృహంలో వంట ఇంటిలో ప్రవేశంలేదు. శ్రీమతి బక్షిగారు ఈయన వంట చేస్తానంటే ఒప్పుకోరు ...

-జి. ఆర్.

చక్కటి పని తెలిసిన షెఫ్‌తో కలిసిపోయి - నాజూకైన వంటలని - వాళ్ళకి నేర్పటం ఆయనకెంతో సరదా!



కొత్త సీరియల్ ప్రారంభం!

# కాంచన సౌధం

రావినూతల సువర్ణాకన్నన్

ఊరి మధ్య శివాలయంలోని జేగంట గణ గణ మ్రోగింది.



## అస్తమ సూర్యుడు తన వేడిని కోల్పోయి పశ్చిమాద్రిలోకి మెల్లగా దిగుతున్నాడు.

ఫలితంగా తన కిరణాలు పడిన చోటల్లా అరుణిమదాల్చి చూడ్డానికి అతిమనోహరంగా ఉంది, దృశ్యం.

హటాత్తుగా కారుమేఘాలు కమ్ముకొచ్చాయి. పొలాలకోసె వెళ్లిన రైతు కుటుంబాలు వానకి ముందే ఇళ్లు చేరాలన్న ఆరాటంతో పరుగులాంటి నడక సాగించారు.

ఆవులు, గేదెలు తమ లేగదూడలకి పాలు కుడుపాలని కాబోలు అంబా రవాలతో దూకుడుగా వస్తుంటే, అల్లంత దూరాన గొడ్ల సావిళ్లలోని లేగదూడలు చెవులు నిక్కబొడుచుకుని తమ తమ తల్లి అరుపుల్ని గుర్తించి తిరిగి–

"అంబా" అంటున్నాయి ఉత్సాహంగా

గోధూళితో, ఎడ్ల మువ్వల గల గలలతో, ఆలమందల అంబారవాలతో, గొడ్లకాడ పిల్లలు పాడే పల్లె పదాలతో, నీలాటి రేవువద్ద పడుచుకన్నెల కిల కిలలతో ప్రకృతి పసిడి కాంతు లీనుతోంది

కారు మబ్బులకి తోడు గాలి, ఆపైసన్నతుప్పర కూడా ప్రారంభమైంది

ప్రకృతిలోని అందాలుగానీ, హటాత్తుగా వచ్చిన మార్పుగానీ మంగికి కనిపించడంలేదు

ఆ మాటకొస్తే ఆమెకి పరిసరాలే కనిపించడంలేదు. ఇంటిదగ్గర పుట్టిడు జ్వరంతో పడుకున్న పోలిగాడే కనిపిస్తున్నాడు

పొద్దున్నే పనిలో కెళ్లేటప్పుడు–

"అమ్మా ! బేగిరాయే ! .. నాకు బయమేత్తాంది !" అంటూ దీనంగా చూసిన కొడుకు చూపులే వెంటాడుతున్నాయి

ఆమె నాలుగు రోజులుగా పన్లోకెళ్లడంలేదు వాడి జ్వరంమూలంగా. కానీ, ఈ రోజు కాస్త గంజైనా తాగడానికిన్ని నూకలు కూడాలేవు. అందుకే జ్వరం పిల్లాణ్ణి ఒంటరిగా వదిలేసి వచ్చింది

గబగబా కాపందుగారింటికెళ్లింది మంగి. అయితే ఆయన పట్నం వెళ్లాడు కూలి డబ్బులు రేపు తీసుకోమందాయన భార్య

హతాశురాలై పోయింది మంగి

నిరాశగా తిరుగు మొహం పట్టింది

ఎప్పుడూ చేనికాడే ఇచ్చేకాపందు అప్పుడు కాస్త ఆలస్యం చేస్తే మళ్లీ అడగడానికామెకి నోరాలేదు అందుకే. మౌనంగా ఇంటికేసి నడిచింది

ఆమె ఇల్లు చేరేసరికి గాలివాన హెచ్చింది

మెల్లగా గుడిశ తడికిక్కట్టిన తాడువిప్పి ఆతృతగా కొడుకేసి చూసింది మంగి

వాడు ఇంకా అలా కుక్కి మంచంలో పడుకుని మూలుగుతూనే ఉన్నాడు

మంగి ప్రాణం బాధగా మూలిగింది. కొడుకు దగ్గరగా వచ్చి తల మీద చెయ్యేసి–

ఓరయ్య పోలీ ! ఎట్టాగుందిరా నానా ?' అంది ఆప్యాయంగా.

వాడు నీరసంగా కళ్లు తెరిచాడు ఆ కళ్లలో తల్లి వచ్చిందన్న ఆనందం, తృప్తి కనిపిస్తోంది. తల మీదున్న తల్లి చేతిని తన చిన్న చేత్తో పట్టుకుని–

అమ్మా ! 'అన్నాడు అస్పష్టంగా

'ఏటయ్యా ?"

'అమ్మా! నా కాకలేత్తాందమ్మా!"

"జొరం తగ్గనీ నానా! బువ్వతిందుగాని!" అనునయంగా అంది మంగి

"కాదు! నాకిప్పుడే కావాలి! "

'బువ్వ తినద్దని ఆశార్లుగోరు సెప్పనేదూ?... అందుకే... ఇయ్యాలా రేపూ బువ్వతినద్దు! " బ్రతిమాలుతున్నట్టు అంది మంగి.

క్షణం ఆలోచించాడు పోలిగాడు. తరవాత-

"అమ్మా!' అన్నాడు మళ్లీ.

"ఏట్నానా? "

"ఆశార్లుగోరు బువ్వ తినద్దన్నారుగదూ?"

"అవున్నానా!"

"పాలు తాగచ్చున్నారుగా కాపిని పాలియ్యి!" ఆశగా అడిగాడు.

మంగి మొహం పాలిపోయింది.

గుండెల్లో దుఃఖ సముద్రాలు పొంగుతున్నా అవి గుండెల్లోనే దాచుకుని–

"అది కాదయ్యా!. ఈ ఎదవ జొరానికి ఏం తొక్కాదదంట!. ఇప్పుడు నేనొస్తుంటే ఆశార్లుగోరు పిల్చి మరీ సెప్పారు! ఈ పాలుగనా తాక్కుంటుంటే జొరం తొందరగా తగ్గుద్ది!. ఆ తరవాత పాలు, బువ్వ అన్నీ తాగచ్చు!" అంది.

"ఊఁ! ఊఁ! నా కాకలేత్తోంది!" ఏడుపు మొదలుపెట్టాడు పోలిగాడు.

"ఉండు గెంజి తెత్తాను!" లేవబోయింది మంగి

"నాకు గెంజొద్దు! పాలే కావాలి!" అంటూ ఏడుపు స్వరం పెంచాడు

దిక్కుతోచలేదు మంగికి

ఎక్కడైనా చిల్లర దొరుకుతుందేమో అన్న ఆశతో గూళ్ళు

# కాంచనసౌధం

పెట్టెలూ వెదికింది

చివరికి ఆమె శ్రమ ఫలించింది

కావిడిపెట్టెలో ఓ పావలా కాసు దొరికింది

మంగి కళ్ళు తళుక్కుమన్నాయి

ఆ పావలా కాసూ, ఓ ముంత తీసుకుని–

"మరైతే నేను పాలట్టుకొత్తాను! నువ్వు లెగవమాకే" అంది కొడుకుతో

"అలాగే" ఆనందంగా అన్నాడు పోలిగాడు

మంగి వెళ్ళింది

బేగిరామ్మా!" వెనకనించి అరిచాడు కొడుకు

"అలాగే నువ్తొంగో!"

రాబోయే పాలకోసం ఆశగా ఎదురు చూస్తూ పడుకున్నాడు పోలిగాడు

అరగంట తర్వాత పాలతో తిరిగొచ్చింది మంగి ఆమె సగం తడిసిపోయింది

ఉత్సాహంగా లేచిన పోలిగాడు తడిసిన తల్లిని జాలిగా చూశాడు అయితే వాడిలోని ఆకలి వెంటనే దాన్ని మరిపింప జేసింది

ముంతలోని పాలు అమృతంలా తోచాయి వాడి కళ్ళకి

'అబ్బో! శానా పాలు తెచ్చావే" అన్నాడు ఉత్సాహంగా

"అవును! మర్నాప్ రెండు పూట్లా తాగాలిగందా! అంది మంగి, షావుకారు కొట్లో పదిపైసలకి అప్పు తెచ్చిన బెల్లం పొట్లాం విప్పుతూ

మరి తొందరగా కాసు! అన్నాడు పోలిగాడు

మంగి చితుకులు మంటేసి పాలు కాచింది అందులో బెల్లం పొడి వేస వెదురు బద్దతో కలిపింది

తల్లి చర్యనంతా ఆనందంగా చూస్తున్నాడు పోలిగాడు

పాలు కాచి, చల్లార్చి సత్తు గ్లాసులో కాసిని పోసి కొడుక్కందించింది మంగి

వాడు నీరసించిన చేతులతో గభాల్న అందుకుని గబగబా రెండు గుక్కలు తాగాడు

వాడి మొహం చేదు తిన్నట్టయింది

"సీ! పాలు బాగా నేవు!" అన్నాడు చిరాగ్గా

"పర్నేదు! కూసి నెలాగో తాగై!" అంది మంగి

ఛీ కొత్తొందమ్మా!

"అవును! జొరంగుంది గదా!

'పాలేటో నాగున్నయ్!

'జొరం వుంటే అంతే! అంటూ బలవంతంగా వాడిక్కాసిని పాలు పట్టింది మంగి

పావలా పాలల్లో అర్ధసేరు నీళ్ళు కలిపానని కొడుక్కి చెప్పలేదామె

వాడు సణుక్కుంటూ, గోల చేస్తూ కాసిని పాలు తాగినా వెంటనే వాంతి చేసేసుకున్నాడు

మంగి మనసు బాధగా మూలిగింది

మెల్లగా వాడి మొహం అదీ కడిగి పడుకోబెట్టింది మంచం దగ్గర బాగు చేసింది

పోలిగాడు అలా కాసేపు మౌనంగా ఉండి ఆపై మెల్లగా నిద్రలోకో, మగతలోకో జారిపోయాడు!

అంతవరకు సముద్ర తరంగాల్లా ఎగిసిపడుతున్న దుఃఖాన్ని అతి ప్రయత్నం మీద ఆపుకున్న మంగి కొడుకు నిద్రపోయాడనుకున్న తరవాత భోరుమంటూ కరువుదీరా ఏడ్చింది

* * * * *

మంగి తల్లి, తండ్రి ఆమె ఊహ తెలియకముందే కాలం చేశారు తల్లిదండ్రులు పోయిన ఆ పిల్లని మేనత్త తెచ్చి పెంచి పెద్ద చేసింది ఆ తరవాత తన ఒక్కగానొక్క కొడుకైన వీరడికిచ్చి పెళ్ళి చేసి, తన బాధ్యత తీరిందని త్వరపడి పెద్దల్లో కలిసి పోయింది

వీరడు పెద్ద కామందు రాయుడి గారింట్లో పాలేరుగా కుదురుకున్నాడు మంగి పని రోజుల్లో కూలీ నాలీ చేసుకుని వట్టి రోజుల్లో ఇంటిపట్టునే ఉండేది

రాయుడు గారిచ్చిన తిండి గింజలతో, మంగి తెచ్చే కూలి డబ్బులతో సంసారం సాఫీగానే సాగిపోతోంది

అయితే చల్లగా సాగిపోయే సంసారం హటాత్తుగా తారుమారైంది వీరడు వ్యసనాల పుట్టగా మారాడు మంగి అల్లాడి పోయింది

రాయుడు పంచాయితి ఎలక్షన్స్‌కి పోటీ చేస్తుంటే, ఆయన కెదురుగా ఆయనకి స్నేహితుడు, దూరపు బంధువు అయిన చౌదరి నిల్చున్నాడు

అంతే, ప్రాణస్నేహితులు బద్ధ శత్రువులై పోయారు ఉప్పు, నిప్పులా చిటపటలాడారు

ఇద్దరికీ పోటీలు పెరిగాయి!

పంతాలు పట్టింపులూ పెరిగాయి

ప్రాపకాండ పెరిగింది!

ఎవరి తరఫున వారు వారి శాయశక్తులా కృషి చేశారు!

వీరడికి రాయుడు పోయించిన సారా బాగా వంట పట్టింది విధిని పడి ఇష్టం వచ్చినట్టు పేల్తున్నాడు

ఆయన స్వార్థంతో పోయించిన నాటు సారా మూలంగా వాడి దృష్టిలో






# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన,దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!

GK&E.B84.55 Tel

# కాంచనసౌధం

రాయుడు ఓ దేవుడై పోయాడు అందుకే ఆయన గొప్పలు కథలు కథలుగా చెప్తున్నాడు ఓట్లు ఆయనకే వెయ్యమని అర్థిస్తున్నాడు

నేను మాత్రం ఏం తక్కువ తిన్నాను? అన్నట్టు చౌదరి కూడా తన వాళ్ళకి తాగబోయించి జేజేలు కొట్టించు కుంటున్నాడు

ఎలక్షన్స్ దగ్గర కొస్తున్న కొద్దీ హడావిడి ఎక్కువయింది ప్రాపకాండా ఎక్కువైంది

ఎలక్షన్స్ జరిగాయి'

ఫలితాలు తెలిశాయి'

చౌదరి నెగ్గాడు'

రాయుడు ఓడాడు'

కక్షలు పెరిగాయి'

కర్రలు విరిగాయి'

బుర్రలు పగిలాయి'

పోలీసులు'. కేసులు'

కోర్టులు, జామిన్లు'

అన్నీ అయ్యాయి'

కానీ ఒకటే నిల్చిపోయింది'

అదే- వీరడికైన తాగుడు అలవాటు'

కొత్త గోడ కేసిన సున్నంలా అలాగే నిల్చిపోయింది' అంతేకాదు' దినదిన ప్రవర్థమానమై విలసిల్లుతోంది

చల్లగా సాగిపోయే సంసారం పిధిన పడింది

అలాంటి సమయంలో మంగికి నెల తప్పింది అయితే అది మంగికి ఆనందాన్నివ్వలేదు

వీరడ్ని మాత్రం సంతోషం ఉక్కిరి బిక్కిరి చేసింది'

ఆనందంతో మరో గ్లాసు ఎక్కువ పుచ్చుకున్నాడు తన వాళ్ళకి తాగించాడు

మంగి ఈ వంకనైనా బాగు పడతాడేమో అన్నట్టు ఆశగా భర్తకి పరిపరి విధాలా ఆ వెధవ తాగుడు మానమని చెప్పింది

ఫలితం శూన్యం'

రాను రాను వీరడు తాగి ఇంటికి రాకుండా అయ్యగారి గొడ్ల సావిట్లోనో, వరండాలో నో పడుకోవడం మొదలు పెట్టాడు

నెలలు నిండుతున్న కొద్దీ మంగిలో నిరాశ కూడా పెరిగి పోయింది




ఇరుగు పొరుగు సాయంతో మంగి పురుడు పోసుకుంది

ఆమెకి కొడుకు పుట్టాడు

మళ్ళీ వీరడు తను తాగి స్నేహితులకి తాగబోయించి తన సంతోషాన్ని ప్రకటించుకున్నాడు

అంతేగానీ-

మంగి ఎలా వుంది? ఎలా బ్రతికింది? ఎలా తింది? అని క్షణం కూడా ఆలోచించ లేదు

పిల్లాణ్ణి చూసైనా మారతాడనుకున్న మంగి భర్త ప్రవర్తనకి మరింత కృంగి పోయింది

చివరి ప్రయత్నంగా రాయుడిదగ్గరికెళ్ళి-

'బాబూ' అడక్కాస్త బుద్ధి జెప్పండి తాగుడు మరిగి ఇల్లే పట్టించుకోడం లెదు' అంటూ వాపోయింది అయితే దానికాయన తేలిగ్గా నవ్వేసి-

ఈ రోజుల్లో మహా మహా వాళ్ళే తాగుతున్నారు వీడెంతే ' అంటూ తేల్చేశాడు

ఒసి పిచ్చిదానా' గొర్రె కసాయివాడిదగ్గరి కెళ్ళి మొర పెట్టుకున్నట్టు నువ్వు ఈయన దగ్గరటె చెప్పుకునేది? అయినా నీ మొగుడు ఒక్క తాగుడుకే బానిస' ఈయన తాగుడికి తోడు మెరక వీధులు కూడా సందర్శిస్తాడు నేనెవరికి చెప్పుకోను " అంది కసిగా రాయుడి భార్య

ఉసూరుమంటూ వెళ్ళి పోయింది మంగి ఆరోజునించి వీరడి మీద ఆశ వదులుకుని తన కష్టం మీదే ఇల్లు గడుపుకొస్తోంది

ఊళ్లో రెండు పార్టీలుగా నిల్చి పోయాయి అమాయకంగా ఉండే పల్లె ప్రజలు మోసాలు నేర్చారు

మాటకి ముందు కొట్లాటలు'

తగూలు' దొమ్మిలు'

కాలగర్భంలో ఆరేళ్ళు గడిచి పోయాయి

వీరడు ఇంట్లో పైసా ఇవ్వడంలేదు ఎప్పుడో ఒకప్పుడొచ్చి డబ్బుకోసం మంగిని పీడించుకు తినడం, కాదంటే గొడ్డును బాదినట్టు బాదడం పరిపాటై పోయింది

అయినా మంగి బాధపడేదికాదు అతను వస్తేనే చాలని ఆరాటపడి పోయేది

ఆశగా ఎదురు చూసేది

భర్త ఒక్క పది నిమిషాలున్నా మురిసి పోయేది ఆరేళ్ళ పోలిగాడి మీదే ప్రాణాలు పెట్టుకుని భర్తలోని మార్పుకోసం పిచ్చి కలలు కంటోంది

ఇప్పుడు పోలిగాడికి నాలుగు రోజులనించి జ్వరం మంగి రాయుడి గారింటికి భర్తకోసం కబురంపింది.

అయినా అతను తొంగి చూడలేదు

అందుకే ఇరుగు పొరుగు వాళ్ళకి కాస్త చూసి పొమ్మని బ్రతిమాలి తప్పనిసరిగా పన్లోకెళ్ళింది

పన్లోకి పోగా మిగిలిన ముసలీ, ముతకా ఒకటి రెండుసార్లు పోలిగాణ్ణి చూసెళ్ళారు

మంగి ఏ ఆశతో జ్వరప్పిల్లోణ్ణి ఒంటరిగా వదిలి వెళ్ళిందో ఆ ఆశ నెరవేరనే లేదు

కూలిడబ్బు చేతికి రానేలేదు

పావలా దొరికినా, పావలా కొచ్చిన పాలుమాత్రం అమృతంలా లేపు పోలిగాడికి

సరైన మందు పడక పోలిగాడి జ్వరం తగ్గలేదు ఇంగ్లీషు మందులిప్పించే శక్తి లేని మంగి ఆచార్లు గారి మందునే నమ్ముకుంది

జ్వరం తగ్గలేదు'

చేతిలో ఎర్రని ఏగాని లేదు!

ఏడవడానికామెదగ్గర కన్నీరు కూడా లేదు!

* * * * * *

పెద్దగా ఉరిమింది ఆకాశం

ఆలో చనల్లో మునిగి పోయిన మంగి ఉలిక్కిపడి చూసింది

బైట అంతటా కటిక చీకటి!

బైట వాన హోరు!

ఓసారి కొడుకుకేసి చూసింది

గుడ్డి వెలుగులో వాడు హాయిగా నిద్రపోతూ కనిపించాడు ఆకలితో నే నిద్రపోయాడు!

భారంగా నిట్టూర్చింది మంగి.

మెల్లగా లేచి కుండలోంచి ఓ గ్లాసునీళ్ళు ముంచుకు తాగి, పోలిగాడి మంచం పక్కనే ఓ గోనె పరుచుకుని నడుం వాల్చింది

పొయ్యి దగ్గర ఏం లేకపోయినా ఎలుకలు హడావిడి చేస్తున్నాయి

దూరంగా ఓ కుక్క మోర ఎత్తి దయనీయంగా ఏడుస్తోంది

ఆకలి!

అంతటా ఆకలి!

ప్రతి ప్రాణికీ ఆకలి!

ఈ ఆకలనేదే లేకపోతే ఎంత బావుణ్ణు! అనుకుంది మంగి, ఎలుకల్నీ, కుక్కల్నీ తల్చుకుని, వాటితో తనని, కొడుకుని పోల్చుకుంటూ

మళ్ళా తన ఆలోచనకి తనే నవ్వుకుంది

ఆకలే లేకపోతే ఈ జీవకోటికి ఒళ్ళు ఒంగేదా? ఎక్కడి ప్రాణి అక్కడ సోమరిగా వుండిపోదూ?

అందుకే ప్రతి జీవికీ ఆకలుంటుంది!

అయితే నోరులేని జంతువులు అలా అరుస్తాయి, బుద్ధి తెలియని పసివారు మారాం చేసి ఏడుస్తారు! అన్నీ తెలిసిన తనలాంటి వాళ్ళు మనసులో నే ఏడుస్తూ ఇలా కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకుంటారు!

అంతే తేడా! మళ్ళీ నవ్వుకుంది మంగి

ఆకాశం మరో సారి గర్జించింది వర్షపు జోరు పెరిగింది

పోలిగాడు గట్టిగా మూలిగాడు

ఆలో చనలో ఉన్న మంగి చటుక్కున లేచి కూర్చుంది

పోలిగాడు మళ్ళీ అదోలా మూలిగాడు

నానా! భయంగా వాణ్ణి తట్టి పిల్చింది మంగి వాడు పలకలేదు

పిచ్చి మాటలు మొదలు పెట్టాడు

మంగికి కాళ్ళూ, చేతులూ ఆడలేదు

నానా! మళ్ళీ అంది ఆదుర్దాగా

వాడు పలకలేదు

మంగి గుండె ఝల్లుమంది

భయంతో ఒణుకేస్తోంది

క్షణం ఆలో చించి గబాల్న తలుపుకట్టిన తాడు విప్పి తలుపు తీసుకుని రివ్వున వీదిలోకి పరిగెత్తింది

వాన ఈ చెంపా, ఆ చెంపా, అన్నట్టు ఎడాపెడా కొడుతోంది

ఆ వానలో నే మంగి కాస్త చేరువగా ఉన్న ఇంటి తలుపు తట్టింది

కాసేపు తర్వాత-

"ఎవురది? కరుగ్గా వినిపించిందో గొంతు

యాదయ్ మావా! నేను! మంగిని! ఓసారి తలుపుదియ్! ఒణుకుతున్న స్వరంతో కంగారుగా అంది మంగి

తలుపులు తెరుచుకున్నాయి!

'ఏటి మంగి! ఇంత వొన్లో! రా! రా! ఆదుర్దాగా ఆహ్వానించాడు యాదయ్య

నీళ్ళు ఓడుతున్న గుడ్డల్ని పిండుకుని, చలికి ఒణికి పోతూ-

మావా! పోలిగోడు అంది గద్గదస్వరంతో

## అప్పుడప్పుడు జీవితం

–డా. సి. నారాయణరెడ్డి

అప్పుడప్పుడు జీవితం ఆవులిస్తుంటుంది
ఉరికే కాళ్ళ కింద
పరుపులు మొలిచినప్పుడు
అజీర్తి – మెలికలు తిరుగుతుంది
అరగని కీర్తిలా;
దిగంబరసత్యం డీకొన్నప్పుడు
అభూతాత్మ ఆనందిస్తుంటుంది
అర్ధరాత్రైనా
నేను నిద్రలా మేల్కొన్నప్పుడు

ఈ లోగా ఇంట్లో అంతా లేచారు

"ఏటే? పోలిగాడికేవైంది? యాదయ్య భార్య రంగి చిమ్నీ వత్తి పెంచుతూ అంది

మంగి చెప్పింది

కంగారుగా చూశారా దంపతులు

"ఏటి సేద్దాం?" అన్నాడు యాదయ్య

అతనికి రాత్రి తాగిన సారా నిషా ఇంకా పూర్తిగా దిగలేదు

"మన డాట్రు బాబుకి సూపిద్దాం!

ఏడాట్రు బాబుకి?

అదే మన సాదరిగోరి మేనల్లుడికి! నేనెల్లి ఆరి కాల్లట్టుకుని తీసుకొత్తాను అత్త కూసేపు ఆడికాడుంటె అంది మంగి

'ఇంత సీకట్లోనూ, ఇంత వొన్లోనా" అన్నాడు యాదయ్య

మరి తప్పదుగా మావా!

పోనీ నువ్వెల్లి తీసుకురాకూడదంటయ్యా" అంది రంగి భర్తకేసి చూస్తూ

గతుక్కుమన్న యాదయ్య బుర్ర గోక్కున్నాడు అతనికి నిషా పూర్తిగా తగ్గందే బైటికెళ్ళడం ఏమాత్రం ఇష్టం వుండదు

'ఒద్దత్తా! మావని పొడుకోనీ! నేనెల్లి ఆర్ని తీసుకొత్తాను! నువ్ మాత్రం ఆడిక్కాస్త తోడుండు! చాలు! బతిమాలుతున్నట్టు అంది మంగి

సరే పద! అంది రంగి

యాదయ్య తాటాకు గొడుగు అందించాడు

ఇద్దరూ గబగబా మంగి ఇంటికేసి నడిచారు

గుడిశలో పల అడుగు పెట్టిన ఆడవాళ్ళిద్దరూ అక్కడి దృశ్యం చూసి హడిలి పోయారు

పోలిగాడు మంచం మీంచి కింద పడిపోయి మెలికలు తిరిగి పోతున్నాడు

గబాల్న వాడిని ఎత్తుకుని భోరుమంది మంగి

ముందు అణ్ణి పడుకోయెట్టి నువ్ లగెత్తి ఆ డాట్రుబాబుని తీసుకురా! అంది రంగి

మంగి ఏడుస్తూనే వాణ్ణి పడుకోబెట్టింది

నువ్ బేగిరా! నేనీణ్ణి సూసుకుంటాను!' వాడి పక్కలో కూర్చుంటూ అంది రంగి

"అత్తా!"

"ఏటే?"

"పోనీ ఈణ్ణి అరింటికి తీసికెల్తే?"

"ఇంత వొన్లోనా? వొద్దొద్దు! నువ్వెల్లు!" తొందర పెట్టింది రంగి

మంగి వీధిలోకి పరిగెత్తి ఆ వానలో నే, ఆ చీకట్లో నే బాణంలా

# కాంచనసౌధం

దూసుకుపోయింది

★ ★ ★ ★ ★

జోరున వాన కురుస్తుంటే రెండు ఊరకుక్కలు, ఓ గేద్దాద హాస్పటల్ అనబడే ఆ డాబా వరండాలో తల దాచుకుని, చలికి వణికిపోతూ ముడుచు పడుకున్నాయి

వైద్య సహాయం ఏమాత్రం లేని ఆ పల్లెలో చౌదరిగారి మేనల్లుడు విశ్వం కొత్తగా బోర్డు కట్టాడు హాస్పటల్ కట్టడం పూర్తయ్యే వరకు చౌదరిగారి ఇళ్ళల్లో ఒకటైన ఈ డాబానే హాస్పటల్‌గా ఉపయోగిస్తున్నారు

విశ్వం మేనమామ ఇంట్లోనే ఉంటున్నాడు అతను రెకమండ్ చేసిన దాసుని కాంపౌండర్‌గా పెట్టుకున్నాడు

దాసు పెళ్ళి కానివాడు

అందుకే డాక్టర్‌గారి అనుమతి మీద ఆ డాబాలోనే ఓ గదిలో ఉంటూ, యమర్జన్సీ కేసులు చూస్తాడు అవసరం అయితే డాక్టర్ని పిల్చుకొస్తాడు

ఆకాశం పెద్దగా ఉరిమింది

ఒక్కసారి విసురుగా విసిరిన గాలికి కిటికీ తలుపులు టపటప కొట్టుకున్నాయి

దాసు విసుగ్గా లేచి తలుపులు మూశాడు

గాలి ఉధృతం అయింది

అలాంటి సమయంలో దూసుకొచ్చింది మంగి,

డాక్టర్ బాబూ! అంటూ

"ఎవరూ? లోపల్నించే అన్నాడు దాసు

బాబూ! నేను బాబూ! మంగిని! అంది మంగి

'మంగా? మంగంటే? విసుగ్గా అన్నాడతను

'అదే ఈరిగోడి పెళ్ళాన్నండి!"

ఏమిటి?"

'మా పోలిగాడికి పేణం మీది కొచ్చింది బాబూ! ఓ పారి సూడండి! ఒణుకుతున్న గొంతుతో అంది మంగి

ఇప్పుడా?'

'అవును బాబూ! ఆడేటో అయిపోతన్నాడు! తొరగా రండి బాబూ!" దాదాపు ఏడుస్తున్నట్టు అంది

డాక్టర్‌గారు లేరు! తాపీగా అన్నాడు దాసు

"మరి మరి

'నేను కాంపౌండర్ని!"

మరి డాక్టర్ బాబేరి?"

"ఇప్పుడెందుకుంటారు?' విసుగ్గా అన్నాడతను అతనికా సమయంలో ఆమె రావడం ఏమాత్రం నచ్చలేదు

మరెలా బాబూ! పిల్లోడు జోరంతో ఒనికి పోతన్నాడు! మా బయంగుంది!' దయనీయంగా అంది మంగి

అయితే నన్నేం చెయ్యమంటావ్?

'పోనీ మీరే ఓ పాలొచ్చి సూసెల్లండి బాబూ!

మెల్లగా తలుపులు తీసుకుని బైటకొచ్చాడు దాసు

"బాబ్బాబు! కుర్రోడి పరిసితేం బాలేదు! తవరు సూసి ఓ మందు బిల్లేత్తే మాక్కాస్త దయిర్నంగా ఉంటది! అంది మంగి

ఇబ్బందిగా చూశాడు దాసు

లోపల్నించి గాజులు గలగల్లాడాయి

కంగారుగా చూశాడతను

మంగి కళ్ళలో ఆశ్చర్యం!

ఇదిగో! నా మాట విని వెళ్ళిపో! ఇప్పుడు నేనొచ్చి చూసినా ఆస్పత్రిలో ఒక్క మందు లేదు ఉదయం పట్నం నించి తెప్పిద్దాం!' అన్నాడు

కానీ "

"ఇదిగో మంగమ్మా! నీ కొడుక్కేం పరవాలేదు! నేను చెప్తున్నానుగా ఇప్పుడంతటా ఫ్లూజ్వరాలున్నాయి! అంతే! రేపో మందుబిళ్ళ వేస్తే టకీమని తగ్గిపోతుంది! నా మాట విని ఇప్పటికెళ్ళు!' పెద్ద వరాలిచ్చే దేవుడిలా పోజు పెట్టి అన్నాడు దాసు

లోపల్నించి మరోసారి గాజుల గలగలలు వినిపించాయి

పరిస్థితి గ్రహించిన మంగి నిరాశగా వెనుతిరిగింది ఆమెకేం చెయ్యాలో అర్థం కాలేదు

పొద్దున్నే వచ్చి తప్పకుండా చూస్తాను!" వెనకనించి అభయమిచ్చాడు దాసు

మంగి క్షణం ఆలోచించి ఏదో నిర్ణయానికొచ్చి రాయుడి గారింటి కేసి పరుగుతీసింది

(ఇంకా ఉంది)






# వారఫలం

27–9–1985 శుక్రవారం మొదలు 3–10–1985 గురువారం వరకు

★ **మేషం** : ధనాదాయానికి లోటు లేదు. ప్రజారంగాన పేరుప్రతిష్ఠలకు లోటు రాదు. చుట్టుప్రక్కల వారికి సాయం చేయవలసిన అగత్య మేర్పడుతుంది. అలా చేయటం పుణ్యార్జనకేగా! స్త్రీలకు అధికారమందభివృద్ధి, ఆశించిన 'యింక్రిమెంటు' లభ్యం కాగలదు

★ **వృషభం** : ఆలోచనలు సంప్రదాయ-సిద్ధంగా, సాంగంగా, సానుకూలం కాగల వారం వృద్ధుల్ను, గౌరవనీయులు యింటికి రానున్నారు ఆదరించి ఆశీర్వచనం అందుకోవలసిన సమయం వ్యవహారరీత్యా అనుకూల సమయం దినాంతాన ఏదో పోగొట్టుకొన్నట్లు బాధ పడతారు స్త్రీలకు విద్యావినోద మూలక కాలక్షేపం ధనలబ్ధి

★ **మిధునం** : ఉత్తమ ఫలదాయక వారమని చెప్పనవసరం లేదు భూసంపద వృద్ధినందించుకోవలసిన అగత్య మేర్పడుతుంది రాకరాక దూరప్రాంతాల నుండి బంధువులో, మిత్రులో యింటికి రానున్నారు వారమంతా హడావుడిగా ఉంటుంది ఆస్తి అభివృద్ధి చేసికోవలసిన నిర్బంధం ఏర్పడుతుంది స్త్రీలకు ఇంటా, బయటా గౌరవాభివృద్ధి

★ **కర్కాటకం** : నూతన సమస్యలు తలఎత్తగలవు ఒకటి చేయబోయి మరొకటి చేయటం జరుగుతుంది వ్యవహారరీత్యా మేలు చేకూరుతుంది కార్యసాధనకిది మంచి సమయం కళారంగాన ప్రతిభకు తగిన పారితోషికం లభ్యం కాగల సమయం గమనించి, శ్రమించండి స్త్రీలకు శుభకార్యనిర్వహణకు, ఉద్యోగమందు ఉత్తమ స్థాయినందుకొనుటకు అనువైన సమయం

★ **సింహం** : ఆడుతూ పాడుతూ నూతన వస్తువులు సేకరించుకొనుచు, గృహ నిర్మాణ కార్యక్రమందు నిమగ్నులగుచు, వారమంతా గడుపుతారు ఉత్తమ ఫలదాయక వారమే. గ్రహించండి స్త్రీలకు అప్రయత్నాదాయం, అధికారమందు పెంపు

★ **కన్య** : నూతన మిత్రులు చేరువకు రాగలరు వారి పనులు నిర్వహించుటకై కాలం వ్యయించవలసిన అగత్యమున్నది అధిక వ్యయం కూడా సంభవమే ఏదో కారణంగా ధనమందు పెంపు కనిపిస్తుంది అన్నిరంగాలలో మీ అభీష్టం నెరవేరుతుంది స్త్రీలకు వృత్తి యందు వికాసం, సుఖసంతోషాలు, స్వల్పాదాయం

★ **తుల** : అభిమానుల ఆదరణతో వృత్తి యందు యింత కాలం ప్రగతి సాధించారు, ఇకనుండి అందుకు అంతరాయమే. రావలసిన డబ్బు అందక యిబ్బంది పడతారు. సాహితీపరంగా కొంత అనుకూలం కొందరకు స్త్రీలకు వస్తు సేకరణ యందు వారమంతా నిమగ్నత

★ **వృశ్చికం** : నూతనాంశాలు గ్రహిస్తారు సుఖశాంతులకు లోపం రాకుండా శ్రమించండి కృషితో ఎలాంటి యిబ్బంది, ఎవరికి రాదుగా! ఆలోచించి చేసిన కార్యం ఎన్నడూ చెడదు రాజకీయవాదులకు అనుకూల సమయంగాదు స్త్రీలకు వస్తువులు, వస్త్రాల సంపాదనకు, ఉద్యోగ ప్రగతికి అనుకూలం

★ **ధనుస్సు** : వార ప్రారంభంలోనే అన్నివిధాలా అనుకూలమని గ్రహించే సన్నివేశాలు ఏర్పడుతాయి వ్యయానికి తగిన ఆయివోజు లభ్యం కాగలదు ప్రజాసమూహంలో గౌరవాధిక్యతకు అవకాశమున్నది స్త్రీలకు యిల్లు మారవలసిన అగత్యమున్నది

★ **మకరం** : మంచి లాభదాయకమైన వారం వ్యాపారాన అంది పుచ్చుకొన్నట్లు లాభార్జన చేయగలరు సుఖశాంతులకు అవకాశం, కుటుంబానందం, ఉద్యోగరీత్యా చేసిన యత్నాలు ఫలవంతం కావటం గమనిస్తారు స్త్రీలకు అనుకొనని మార్గాన ధనలబ్ధి, ఉద్యోగమందు ప్రశాంతి

★ **కుంభం** : పోగొట్టుకొన్న వస్తువుల భోగట్టా తెలిసికోగలరు నూతన యత్నాలు ఫలవంతం కాగలవు అప్రయత్నంగా ధనాదాయముంటుంది వారాంతంలో ఉద్యోగమందభివృద్ధి కనుగొంటారు స్త్రీలకు ఇంట శుభం జరగటం, తద్వారా వ్యయం

★ **మీనం** : బంధువుల 'కొరకో', మిత్రుల కొరకో, పరిచితుల కొరకో మీ కాలం వ్యయించవలసిన అగత్యమున్నది సంతానం కొరకు చేసిన ఉద్యోగ యత్నాలు ఒక రేవునకు రావటం గమనిస్తారు ప్రయాసతో వ్యాపారమందు అంతో యింతో ధనం గడింపగలరు స్త్రీలకు సంఘ గౌరవం, ఉద్యోగమందు ప్రశాంతి, యత్నకార్యసిద్ధి

– విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



ఒకప్పటి ప్రముఖ సినీ నటి, ఇప్పటి అఖిల భారత అన్నా ద్రావిడ మున్నేట్ర కళగం పార్టీ ప్రముఖులలో ఒకరు, రాజ్యసభ సభ్యురాలు జయలలిత తిరిగి పార్టీ ప్రచార కార్యదర్శిగా నియమింపబడ్డారు సంవత్సరం క్రితం ఈమె ఈ పదవినించి తప్పుకున్నారు గతంలో మంత్రి వీరప్పన్‌కీ ఈమెకీ తీవ్రమైన విభేదాలు వచ్చాయి ఇప్పుడు ఈమెని పార్టీ ప్రచార కార్యదర్శిగా నియమిస్తూ, మంత్రి వీరప్పన్ మొదటినించీ నిర్వహిస్తున్న సమాచార, ప్రచార, ఫిలిం టెక్నాలజీ మంత్రిత్వ శాఖలని ముఖ్యమంత్రి ఎం జి ఆర్. తీసుకుని ఇప్పటిదాకా తాను చూస్తున్న ప్రణాళిక, పురాతత్వ, పాస్‌పోర్ట్ శాఖలని ఆయనకి బదిలీ చేశారు ఇది వీరప్పన్ వర్గానికి పెద్ద దెబ్బ అనుకుంటున్నారు. గతంలో ఎం జి ఆర్ వైద్య చికిత్స కోసం అమెరికాలో ఉన్నప్పుడు పార్టీలో అంతర్గతమైన విభేదాలు తీవ్రంగా ఏర్పడ్డాయి ఆయన తిరిగి వచ్చిన తర్వాత అవి సమసిపోయాయి. కాని ఇటీవల మళ్ళీ ఆయన వైద్య పరీక్షకోసం నెల రోజులు జపాన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలకి వెళ్ళినప్పుడు అవి తిరిగి తలఎత్తాయి వీరప్పన్ వర్గం పలుకుబడి పెరిగింది. అందుకే శ్రీ ఎం జి ఆర్ తిరిగి వచ్చిన వెంటనే ఈ చర్య తీసుకున్నారు. ఆయన జపాన్ వెళ్ళేముందు శ్రీమతి జయలలితకి పార్టీ ప్రచార కార్యదర్శి పదవి ఇస్తామని అన్నారు కానీ ఆమె ఆలోచించి చెపుతానని అన్నారు అది ఆయన ఎదురు చూడని సమాధానం కానీ రాబోయే స్థానిక సంస్థల ఎన్నికల దృష్ట్యా ఆమెకి ఇప్పుడు ఆ పదవిని ఇవ్వక తప్పదు జన సమూహాలని విపరీతంగా ఆకట్టుకోగల వ్యక్తి ఆమె తప్ప పార్టీలో మరొకరు లేరు ఆమె సభలకి ప్రజలు విపరీతంగా వస్తారు, ఆమె ప్రచారంచేస్తే ఆ పార్టీకి వోట్లు బాగా వస్తాయి శ్రీ ఎం జి ఆర్ కి ఇంకా మాట సరిగా రావటంలేదు అందుకే మిగతా పదవులు అన్నిటికి నియామకాలు జరిగినా పార్టీ ప్రచార కార్యదర్శి పదవి మాత్రం సంవత్సరం పాటు తిరిగి ఈమె నియమింపబడేవరకూ ఖాళీగానే ఉండిపోయింది □

# సమాధానం

## కోరుకొండ సత్యానంద్

మళ్ళీ నేనీ ఊరు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చాను జాయినింగ్ టైమ్ ఇంకా నాలుగు రోజులుంది ఈలోగా ఇల్లూ వాకిలీ చూసుకొని డ్యూటీకి రిపోర్టు ఇచ్చాక సెలవు మీద ఇంటికి వెళ్ళి ఫేమిలీని తీసుకొని రావాలి

డిగ్రీలో క్లాస్‌మేటూ, మంచి మిత్రుడు అయిన ఆనంద్ ఈ ఊళ్ళోనే ట్రాన్స్‌ఫర్ లేని చక్కని ఉద్యోగం చేసుకుంటూ హాయిగా బ్రతుకుతున్నాడు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు వచ్చి రావడంతోనే వాడికో టెలిగ్రాం ఇచ్చేను రిలీవ్ అయిన వెంటనే బయల్దేరి వాడింట్లో వాలేను వాడు నాకు అభయహస్తం చూపించి నా ఏర్పాట్లన్నీ తనే చూస్తానని అన్నాడు దాంతో సంతృప్తవదనుడనై వాడిని వెంటేసుకొని ఊరి మీద పడ్డాను

వాడికి ఎజ్డీ ఉంది దాని మీద ఇద్దరం తిరుగుతూంటే దార్లో శివాలయం కన్పించింది

వెళ్దామా?' అని వాడ్ని అడిగేను

నడు అన్నాడు వాడు

ఎజ్డీ"ని క్రింద మెట్ల దగ్గర పెట్టి ఇద్దరం మెట్లెక్కడం మొదలు పెట్టాం

ఆలయ ప్రాంగణంలోకి అడుగు పెట్టాలంటే ఓ వంద మెట్లెక్కాలి నేనీ ఊళ్ళో పన్చేస్తున్నప్పుడు అప్పుడప్పుడూ శ్రీమతితో కలసి ఈ గుడికి వచ్చేవాడిని

మెట్లెక్కుతుంటే సడన్‌గా నాకో వ్యక్తి గుర్తొచ్చాడు వాడి పేరు కూడా నాకు తెలీదు గానీ వాడో ముష్టివాడు ఓ నలభై మెట్లపైన ఉండే విశాలమైన చప్టా మీద కూర్చొని అడుక్కునే వాడు వాడు అడుక్కునే విధానం, అడిగినప్పుడు వాడి ముఖ కవళికలు, వాడి డబ్బాలో చిల్లర పడుతున్నప్పుడు నా వైపు చూసే కృతజ్ఞతా పూర్వకమైన చూపు నన్నెందుకో ఎంతగానో ఆకట్టుకొనేవి . రచయితనైన నేను వాడ్ని బాగా పరిశీలించడం వల్లనూ, ఒకసారి ఓ ముష్టివాడి పాత్ర కథలో వ్రాయాల్సి వచ్చినప్పుడు వాడినే దృష్టిలో పెట్టుకొని వ్రాయడం వల్లనూ వాడు నాకు గుర్తుండిపోయాడు

అప్పుడు వాడు కూర్చొని అడుక్కొనే చప్టా వచ్చాక నేను వాడికోసం చూసాను వాడక్కడ లేడు

ఆనంద్ మాట్లాడుతుంటే వాడి గురించిన ఆలోచనలను ప్రక్కన పెట్టి ఆనంద్‌తో మాట్లాడ్డం మొదలు పెట్టేను

అప్పుడు మెట్లెక్కుతుంటే ఆయాసం వచ్చేది కాదు ఇప్పుడు ఆయాసం వస్తుందేమిట్రా?

"వస్తుంది మరి సుఖానికి అలవాటు పడిపోయి, శరీరానికి శ్రమనివ్వకపోతే ఆయాసం రాదు మరి? ముందా పొట్ట తగ్గించరా' అన్నాడు నా పొట్టవైపు చూస్తూ ఆనంద్

అవును, నాకీ మధ్య పొట్ట వస్తోంది అందుకు నాకు నేనే బరువు ఫీలౌతున్నాను

కూర్చొని కథలు వ్రాయడం కాస్త తగ్గించి ఉదయం పూట కాస్త పరుగెత్తుతుండు " అని నవ్వేక నేను అలాగే అన్నాను

ఆగుదామా?

"వద్దులే' స్పీడు తగ్గిద్దాం' అని నెమ్మదిగా ఎక్కడం మొదలెట్టాను ఆనంద్ ఏవో మాట్లాడుతున్నాడు

ఇంకో పదిమెట్లుంటాయి అనుకోకుండా నా దృష్టి మొదటి మెట్టుమీద పడింది ఆ మెట్టు మీద వాడు, అదే ఆ ముష్టివాడున్నాడు

ఎందుకో అనుకోకుండా నాకు కొద్దిగా సంతోషం కలిగింది

వాడిని ఆనంద్‌కు చూపించి అన్నాను అక్కడ చూడు, ఆ మొదటి మెట్టుమీద అడుక్కుంటున్నాడు, అప్పుడు నేనీ ఊళ్ళో వర్క్ చేస్తున్నప్పుడు ఇంకా క్రింద కూర్చొని అడుక్కునే వాడు అప్పుడు గుడికి వచ్చేటప్పుడు చూసేవాడ్ని ఎందుకో నాకు వాడంటే వెరి ఇంట్రెస్ట్ వాడ్ని దృష్టిలో ఉంచుకొని ఓ కథలో ఓ కారెక్టర్ని కూడా డెవలప్ చేసాను '

"ఆ కథ పడిందా?" మధ్యలో అందుకొని వెటకారంగా అన్నాడు ఆనంద్.

"పడటమేమిటి? సెకెండ్ ప్రైజ్ వచ్చింది "

"అలాగా, ఏం వ్రాసావేమిటి వాడి గురించి?

'వాడి గురించేం వ్రాయలేదు వాడి బిహేవియర్, ఆకారం, మాటలు ఇవన్నీ ఓ కథలో బెగ్గర్ కారెక్టర్కి తగిలించేను కథ వేరే అయినా వీడికి ప్రతిరూపమే ఆ కారెక్టర్ అన్నాను నేను

"అయితే వీడి గురించి నీకేమి తెలియదన్నమాట

"తెలియడానికి ఏముంది అంతకన్నా?"

అబ్బో' వాడి గురించి చాలా ఉంది చెప్పడానికి . చెప్తే నువ్వు ఆశ్చర్యపోతావ్!"

ఏమిటి?" ఆతృతగా, ఉత్సాహంగా అడిగాను .

'గుళ్ళోకి వెళ్ళొచ్చాక చెప్తాన్లే' అన్నాడు వాడు

వీడొకడు , పెద్ద సస్పెన్స్ క్రియేట్ చేస్తున్నాడు విషయం ఏమి ఉండదేమో'?' ఏమిలేని దాన్ని గొప్పగా చెప్పి ఆ తర్వాత పెద్దగా నవ్వేసే ఆనంద్ అలవాటు గుర్తొచ్చి అనుకున్నాన్నేను. .

మొదటి మెట్టు దాటుతూ వాడి వైపు చూసాను.. మనిషిలో అప్పటికీ ఇప్పటికీ ఎ మార్పూ కన్పించలేదు నాకు వాడు పనిలో వాడు 'బిజీ'గా ఉన్నాడు

కార్తీక మాసం గుడి చాలా రద్దీగా ఉంది . రెండు గంటలు పట్టింది మా పేర అభిషేకం జరిగేసరికి

తిరిగి వస్తూ జేబులోంచి చిల్లర పైసలు తీసి ఓ పది పైసల్ని ముందుగా వాడి సిల్వర్ క్యారేజీలోనే వేసేను వాడి ముఖ కవళికల్లోనూ, కళ్ళల్లో కృతజ్ఞతా పూర్వక భావం లోనూ కూడా అప్పటికీ ఇప్పటికీ ఏ మార్పూ కన్పించలేదు నాకు చిల్లర ఉన్నంత వరకూ వేసి మెట్లు దిగిపోయి మోటారు సైకిలు దగ్గర ఆగాం

'ప్రసాదం తిను. అని ఆనంద్ నా చేతికి ఓ కొబ్బరి ముక్కను ఇచ్చి వాడూ నోట్లో వేసుకున్నాడు

కొబ్బరి ముక్క నములుతూ "ఇప్పుడు చెప్పరా ఆనంద్. వాడి గురించి" అన్నాన్నేను

ఏమిట్రా, అంత ఇంట్రెస్ట్‌గా అడుగుతున్నావ్, కథ గాని వ్రాస్తావేమిటి?

"అదేం కాదు గానీ, చెప్పరా'

ఆనంద్ చెప్పడం మొదలు పెట్టాడు

అది సంధ్యా సమయం సూర్యుడు ఎర్రగా మెరుస్తున్నాడు గాలి రివ్వున వీస్తుంది . ' ఆనంద్ అలా చెప్పుకు పోతున్నాడు

"ఒరే ఒరే ఏమిట్రా చెప్తున్నావు?"

మరి మీ కథలు వ్రాసేవాళ్ళు కథల్ని ఇలాగే మొదలు పెడ్తారు కదరా'

ఇంక చాల్లే చెప్పరా''

'అయితే విను వాడి పేరు అప్పల నరసింహం వాడి ఉద్యోగం చిన్నప్పటి నుండీ అడుక్కోడమే' ఈ గుడి కట్టిన కొన్నాళ్ళకు వాడు ఈ గుడి దగ్గరకు వచ్చాడు వాడిప్పుడు ఇక్కడున్న ముష్టివాళ్ళందరికీ హెడ్డు, పైగా. డబ్బున్న వాడూను . అందుకే మొదటి మెట్టు మీద కూర్చున్నాడు చిల్లర వ్యాపారం, వడ్డీ వ్యాపారం, సెకెండ్ హ్యాండ్ బట్టల వ్యాపారం, చిత్తుకాగితాలు, పాల కవర్ల వ్యాపారం ఇలా చాలా వ్యాపారాలున్నాయి వాడికి నాకు లేని స్వంత ఇల్లు వాడికుంది . ఈ మధ్యనే వాడి కూతురికి

ఘనంగా పెళ్ళి చేసాడు వాడి వ్యాపారాల్లో అల్లుడు సాయం చేయడం మొదలెట్టాడు వాడిక్రింద ఈ వ్యాపారాల్లో పాతిక మంది పైగా ఉన్నారు ఇది కార్తీక మాసం కాబట్టి ఈ టైమ్‌లో మనకు కన్పించాడు గానీ, మామూలు రోజుల్లో అయితే వాడి దర్శనం ఉదయం రెండుగంటలు, సాయంత్రం రెండు గంటలు మాత్రమే' హమ్మయ్య' అని వెటకారంగా ఆయాస పడుతూ ఆగాడు ఆనంద్

'ఏరా, ఆశ్చర్యపోతున్నావా? లేక ఏదైనా కథ వ్రాద్దామని ఆలోచిస్తున్నావా? మళ్ళీ ఆనందే అన్నాడు

"అదేం కాదురా, ఆ మధ్య ఓ పత్రికలో ఇలాంటి డబ్బున్న ముష్టివాడి కథ ఒకటి వచ్చింది ఇప్పుడు ఆ కేరక్టరు కళ్ళకు కన్పిస్తుంటేనూ ఆనందంగా ఉందా? ఇంక ఆ విషయం వదిలేసి నడు, ఇంటి కోసం గాలిద్దాం .! నీ కొంప కాదు గానీ చలిగాలికి రొంప పట్టేస్తుంది నాకు ఇప్పటికే ఇక్కడ రెండు గంటలు పైగా టైమై పోయింది " అని ఎఙ్జిన్ స్టార్ట్ చేసాడు

నేను మాత్రం ఆలోచిస్తూనే ఉన్నాను

చిన్నవో పెద్దవో అన్ని రకాల వ్యాపారాలుండి, మామూలుగా బ్రతికే అవకాశాలుండి హాయిగా ఉండకుండా ఇంకా ఆ ముష్టి బ్రతుకే బ్రతుకుతా డెందుకు వాడు?

ఇందాకట్నుండి అదే ప్రశ్న నా మెదడును తొలిచేస్తోంది

ఆనంద్‌ని అదే అడిగాను ఆ సాయంకాలం తాజ్ లో కాఫీ త్రాగుతూ

ఆనంద్ నవ్వేడు

ఈ ప్రశ్న అప్పల నరసింహాన్ని అడుగుదామనుకుంటున్నావా?

అహఁ వాడ్ని అడుగుతానని కాదు , నాకలా అన్పిస్తుంది అన్నాను

"నీకేదైతే అన్పించిందో అదే వాడిని అడిగావనుకో, వాడేమంటాడో తెల్సా?'

ఏమంటాడు? కొంచెం ఆసక్తిగానే అడిగాను

'బాబూ' నీకు సొంత ఇల్లు ఉందా?

ఆనంద్ అలా అడుగుతుంటే నాకేమీఁ అర్థం



కాలేదు...

"చెప్పరా, చెప్పు... అడిగిన వాటికి అబద్ధం ఆడకుండా సమాధానం చెప్పు!" అన్నాడు ఆనంద్....

"ఉంది, మా ఊర్లో... అద్దెకి ఇచ్చేసాను..." అన్నానేను...

"ఏదైనా మోటారు సైకిలుందా?"

"ఉంది... స్కూటరు..."

"నీ దగ్గిర ఎంత బంగారం ఉంది?"

"మా ఆవిడ నగలు మొత్తం ఇరవై తులా లుంటాయి..."

"ఇంకేమైనా ఆదాయం ఉందా!?"

"ఉంది... మా ఊర్లో నాలుగెకరాల పొలం ఉంది.... దాని మీద సంవత్సరానికి పదిహేను, ఇరవై వేలు వస్తుంది..."

"ఇంకా?"

"ఇంకా... నేను కథలు, నవలలు వ్రాస్తుంటాను, వాటి మీద కొద్దిగా వస్తుంది...."

"నీకు ఉద్యోగం ఉందా?"

"ఉంది...."

"జీతం?"

"రెండు వేలు దగ్గర వస్తుంది...."

"ఏం బాబూ? బోలెడంత బంగారం ఉంది, నాలుగెకరాల పొలం ఉంది, దాని మీద మంచి ఆదాయం వస్తుంది, సొంత ఇల్లుంది, దాని మీద అద్దె వస్తుంది, ఇంకా చిన్న చిన్న ఆదాయాలున్న నువ్వెందుకు ఉద్యోగం చేస్తున్నావ్?"

## ఊహాపోహలు!

స్వర్ణగిరి శిఖరాలకు చేరుస్తుంటాయి!
బలి సదనాలకు పడద్రోస్తుంటాయి
నరుని మానస వైకుంఠ పాళిలో
"నిచ్చెనలవి"

— కె. కిశోరు బాబు

— కె. అశోకు బాబు

# సమాధానం

"చేయకపోతే ఎలా?"

"ఏం? ఉద్యోగం మానేసి ఇంకేదైనా చెయ్యొచ్చుగా? లేకపోతే వచ్చే ఆదాయాన్ని సరిపుచ్చుకోవచ్చుగా?"

"ఇంకేం చేయాలి? నాకు ఈ ఉద్యోగమే సుఖంగా ఉంది... మంచి ఉద్యోగం ఉండగా దాన్ని మానేసి ఉన్నదాన్ని సర్దుకుంటూ బ్రతకడం ఎందుకు?"

ఆనంద్ నవ్వేడు... ఈ సారి గట్టిగానే నవ్వేడు.... అది హోటల్ అన్న విషయాన్నే మరచిపోయి....

బిల్లిచ్చేసి బయట పడ్డాం.... బయటికి వచ్చాక అడిగేను...

"ఏరా, అన్ని ప్రశ్నలు వేసి అంత గట్టిగా నవ్వేవు?"

"అక్కడే ఉందిరా నీ ఆలోచనకు, ప్రశ్నకు సమాధానం... వాడ్ని నువ్వు ఈ ముష్టి బ్రతుకు ఎందుకు బ్రతుకుతున్నావ్ అని అడిగితే వాడలాగే అన్ని ప్రశ్నలు వేసి ఆఖర్న...." మీకెలాగైతే ఉజ్యోగం సుఖంగా ఉందో, మీరెలాగైతే ఉజ్యోగం ఇడిసి పెట్టేసి ఒచ్చే ఆదాయాన్ని సర్దుకోకుండా బతకరో అలాగే నేను కూడా ఈ ముష్టెత్తుకోవడం మానేసినా ఒచ్చే ఆదాయాన్ని సర్దుకుంటూ బతకలేను.... అయినా బాబయ్యా ఇక్కడ నేనేటి అలిసిపోతున్నాను? ఈ గుడికాడ అడుక్కోడంలో నాకు బోల్డు సుఖంగా ఉంది బాబయ్యా!" అని అంటాడు వాడు...

నేను ఒకే నిముషం వరకూ మాట్లాడలేకపోయాను...

"అలా అంటాడని నీకెలా తెల్సురా?" అడిగాను నేను....

"వాడి గురించి తెలిసిన కొందరు నీలాగే ఆలోచించి వాడ్ని అలా అడిగినప్పుడు మరి వాడు ఇలాగే అన్నాడు... వాళ్ళలో నేనూ ఒకడ్ని! అందుకే నువ్వలా అడిగితే వాడిలా సమాధానం చెప్తాడని జోస్యం చెప్పగలుగుతున్నాను...." అన్నాడు ఆనంద్....

ఆ తర్వాత నేను ఈ ఊరికి ఫామిలీని తీసుకొచ్చేసాక అప్పుడప్పుడూ ఆ గుడికే వెళ్ళేవాడిని.... అక్కడ అప్పల నరసింహం చాలా సార్లు కన్పించేడు.... వాడు కన్పించిన ప్రతీసారి నాకు ఆనంద్ చెప్పిన విషయాలే గుర్తొచ్చేవి! □

# నవ్వుల పువ్వులు ________ గీతా:




అలా చూడకు! అద్దె ఇస్తే చాలు..
నాకు ఇంకేం వద్దు!...బయట..
మా ఆవిడ......


సారీ!.. ఇరుక్కు
పోయింది....
DABBOO


ఈ ఫోన్
నీ కోసం...


కలసి వుండాలని...
శతవిధాల ప్రయత్నించాం!
కుదరడం లేదు... మాకు
విడాకులు ఇప్పించాలి....
లాయర్
లక్ష్మారావు

సీరియల్

# అంతరాలు-అంతర్యాలు

బోసుబాబు

(గత సంచిక తరువాయి)

సరోజ అతి సామాన్యమైన దుస్తులు ధరించింది. లంగా, ఓణీ, జాకెట్టు-కాళ్లకు వున్నవి కూడా మామూలు చెప్పులే. వదనంలో వినయం, చూపుల్లో అమాయకత్వం ఉట్టిపడుతోంది. పౌడర్లు, క్రీములు పులుముకోనక పోయినా, మేలిమి బంగారానికి మరింత వన్నెతెచ్చేంతటి శరీరచాయ. ఆమె మనసు కూడా బంగారమేనన్నట్లు తలపింప జేస్తోంది.

'రండి, ఇలా కూర్చోండి....' అని ఆహ్వానిస్తూ కుర్చీలు చూపించాడు శ్యామం. 'విత్ యువర్ కైండ్ పర్మిషన్...' అంటూ కూర్చుంది శోభ.

'ఫరవాలేదు లెండి...' అంటూ సరోజ మెల్లగా కుర్చీని సమీపించి కూర్చుంది.

శ్యామం వెంటనే అన్నాడు-

'మీరు సుబ్బారావుగారి కుమార్తె కదూ...'

'అవునండి...' అంటూ లేవబోయింది సరోజ. శ్యామం వలదని వారించాడు.

'వీరు....? అంటూ శోభవైపు చూచి అడిగాడు.

'ఐ ఇన్‌ట్రడ్యూస్ మైసెల్ఫ్... ఆఁ... మరి... నా పేరు శోభారాణి. నా ఫ్రెండ్స్ అంతా నన్ను ఆప్యాయంగా శోభ అంటారు. అఫ్‌కోర్స్...' అని ఇంకా ఏదో చెప్పబోతోంటే, శ్యామం అడ్డుతగిలి... 'మీ నాన్నగారు...?' అంటూ ప్రశ్నార్థకంగా చూచాడు.

'ఓహ్.' అదా... సారీ... చెప్పడం మరచాను. మా నాన్నగారిపేరు మాధవరావుగారు. బ్యాంకర్. చాలా ఫరమ్స్‌లో షేర్లున్నాయనుకోండి. అయినా, మా నాన్నగారిపేరు తెలియనివారు సాధారణంగా వుండరే...' తానే ఆశ్చర్యపోయినట్లుగా అంది శోభ.

'కావచ్చు. కాని నేను చిన్నవాణ్ణి. నా వృత్తి వ్యాపకాలువేరు కాబట్టి మీ నాన్నగారి గురించి నాకు తెలియకపోవచ్చు....' అంటూ సరోజవైపు తిరిగి, ....'ఏమండీ, నాన్నగారు కులాసాయేగా... ఆయన పాతకాలపు వ్యక్తిలా పైకి

**జరిగినకథ-4 :** సుబ్బారావుగారు వ్యక్తిత్వం గలవారు, పరోపకారి. ఆయన సతీమణి సుబ్బమ్మగారు. ఎదిగిన కొడుకులు డబ్బు సహాయం చేయడం లేదే అని, చిన్నకూతురు సరోజ చిన్న చిన్న సరదాలు కూడా తీర్చలేక పోతున్నామే అని ఆమె బాధ. పెద్దకూతురు శాంతను పురిటికి తీసుకు రావటానికి పైకం అప్పు తీసుకొచ్చి ఊరికి వెళతారు సుబ్బారావుగారు. శాంతను, పిల్లలను విజయవాడ తీసుకు వస్తారు. ప్రయాణంలో ఆయనకు శ్యామసుందరరావు పరిచయం అవుతాడు. శ్యామం సుబ్బారావు ఇంటికి వచ్చి వెళ్లాడు. తన స్నేహితురాలు శోభతో కూడా సరోజ శ్యామసుందరరావు ఇంటికి వెళుతుంది.

కనిపిస్తారు. కాని ఆధునికులకంటే ఆధునికులు. మంచిని ప్రేమించే వ్యక్తి. అందుకే ఆయనంటే నాకు అభిమానం...' అన్నాడు శ్యామం.

శ్యామం సరోజవైపు తిరిగి మాట్లాడుతోంటే, శోభ శ్యామాన్ని కన్నార్పకుండా చూస్తోంది.

ముందుకుపడిన ముంగురులు సరిచేసుకుంటుంటే శ్యామం విశాలమైన నుదురు పసిమి వన్నెలో మెరుస్తోంది. చూపులు నిలుపుతోంటే, వాటిల్లోంచి అయస్కాంత తరంగాలు ప్రసారమవుతున్నట్లు తలపిస్తోంది. అప్పుడప్పుడు కనురెప్పలల్లార్చుతోంటే, సాదరంగా ఆహ్వానిస్తున్నట్లుగా భావిస్తోంది. అందమైన అతని పలుచని పెదవులు కలుస్తూ, విడిపోతూ క్షణంలో సగంసేపు చిరునగవు చూపుతోంటే, అక్కడి కదే ఓ అమృతకలశంగా భావిస్తోంది. సన్నని మీసకట్టు, కొనదేరిన ముక్కు ఆ చిరునవ్వుకు మరింత వెలుగునిస్తున్నాయి. లేత గులాబి రంగులోని చేతివ్రేళ్ళు, మాటలతో సరితూగుతూ విన్యాసాలు చేస్తోంటే, ఎక్కడెక్కడో మీటుతూ హాయినిచ్చే స్పర్శకోసం ఆహ్వానిస్తున్నట్లుగా వున్నాయి. అతగాడి కంఠస్వరం ఒకప్పుడు గంభీరంగా, మరొకప్పుడు ఆదేశించినట్లుగా, ఇంకొకప్పుడు దరిజేరమని ఆహ్వానించినట్లుగా, వేరొకప్పుడు లాలించినట్లుగా హాయిగా, తీయగా వుంది... ఇవన్నీ శోభ తలపులు. చూచేకొద్దీ ఇంకా, ఇంకా చూడమంటోంది శోభ మనసు. శ్యామం వదనం, రంగులతో గాక, వెలుగు కిరణాలతోనే రూపుదిద్దుకుంది శోభ హృదయంలో. హాయిగా నవ్వుకుంది ఆమె మనసు. కాని ఎందుకో మరి ధైర్యం చాలలేదు. ఆ నవ్వు చిరునవ్వుగానే మిగిలిపోయింది. ఇదేమి చూడనేలేదు శ్యామం. తన ధోరణిలో తాను సమాజం గురించి, ముఖ్యంగా స్త్రీల పరిస్థితి గురించి, తన అభిప్రాయాలు చెప్పుకు పోతున్నాడు. సరోజ శ్రద్ధగా అన్నీ వింటోంది. కాని శోభ మాత్రం మాటలు వినబడుతున్నా, మనసు మరెక్కడో వుంది. ఆ మనసు శ్యామంపైలగ్నమై వుంది.

ఇంతలో శ్యామంగారు అన్న పిలుపు వినబడగానే, శ్యామం తక్కిన మాటలు ఆపి, గుమ్మంవైపు చూచాడు. ఆహ్వానం అక్కరలేదన్నట్లుగానే ముగ్గురు యువకులు లోపలికి ప్రవేశించారు. వందన ప్రతివందనాలు ముగిశాయి.

అక్కడి వాతావరణంలో తాను శ్యామంతో మాట్లాడటం సాధ్యపడదని భావించింది శోభ. ఏకాంతంగా వున్నప్పుడే కలుసుకో.... అంటూ శోభ మనసు సలహా చెప్పింది.

"మళ్లీ ఓసారి వచ్చి కలుస్తాను లెండి...." అంటూ శోభ లేచింది.

"మంచిదండీ...." అన్నాడు శ్యామం. తత్తరపడి బిత్తరపోయింది శోభ. కాసేపు కూర్చోండి అంటాడేమోననుకుంది. కాని వెళ్లిరండి అనే అర్థంలో "మంచిదండీ." అన్నాడు. ఇందుకే శోభ మనసు చివుక్కుమంది. కాని శ్యామం గౌరవపూర్వకంగా లేచి నమస్కరిస్తూ చిరునవ్వు చూపాడు. ఈ నవ్వు శోభ మనసును ఊరటపరచింది. ఆమె అప్రయత్నంగానే లేచి, ప్రతినమస్కారం చేసి ఆ గదిలో నుంచి వెళ్లిపోయింది. సరోజతో తాను కలసి వచ్చిన సంగతే

మరచిపోయింది. శోభ చరచర వెళ్ళిపోవడం చూచిన సరోజ ఆశ్చర్యపడింది. తాను కూడా వెడతానంది. శ్యామం కనుసైగతో కూర్చోండి అని కోరాడు. సరోజ కదలలేకపోయింది.

ఆ వచ్చినవారు శ్యామానికి చిరపరిచితులే.

"ఏమిటి విశేషం.... మోహనరావుగారు మా ఆఫీసుమీద అలిగినట్లుందే...." శ్యామం నవ్వుతూ అన్నాడు.

"అదేం లేదు బాబు... చూచిపోదామని వచ్చాము. మీరెప్పుడూ బిజీగానే వుంటుంటారు కదా. అందుకని ఈ మధ్య రావడం తగ్గించాను..." మోహనరావు సంజాయిషి చెప్పుకున్నట్లు అన్నాడు.

"మీ యిద్దరి విషయం ఏమోగాని, ఈ రోజుల్లో అందరూ బెట్టుగా– అంటే– కొంత రిజర్వుడుగా వుండటానికి ప్రయత్నిస్తున్నారని పిస్తోంది..." గోవిందరావు నుంచి అనుకోని వ్యాఖ్య వినిపించింది.

"ఎందుకంటారు?" రాధాకృష్ణ ప్రశ్న.

"కారణం ఏదైనా, పరిణామం మాత్రం ఇదే. స్వార్థపూరితచింతనే కొంతవరకు కారణం కావచ్చునని నా ఊహ...."అని గోవిందరావు అన్నాడు.

సరోజ ఈ సంభాషణను శ్రద్ధగా ఆలకిస్తోంది. ఏవేవో కొత్త మాటలు వినబడుతున్నాయనుకుంది కాబోలు.

"అక్కడితో ఆగారేమి. చాలా మంది స్వార్థాన్ని దృష్టిలో పెట్టుకునే వ్యవహరిస్తున్నారు. అవసరం లేనిచోట రిజర్వుడుగా వుంటున్నారు. అదీ స్వార్థంతోనే. అవసరం వున్నచోట కాకాయిజం ప్రయోగిస్తున్నారు. ఇక్కడికిదీ స్వార్థమే. అందుకే మనుషుల మధ్య సంబంధాలు కూడా బిజినెస్ లైక్‌గానే తయారయ్యాయి." అని మోహనరావు తనకు తెలిసినది కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పాడు.

"అదికాదు గురూ, సమాజంలో కలిమిలేముల తారతమ్యం వున్నంతవరకు, మనుషుల మధ్య సంబంధాలు ఇలానే ఏడుస్తాయి. వియ్యాలు, కయ్యాలలో కూడా బంధాలు, బాంధవ్యాలు ఇలాగే వుంటాయి..." ఇది రాధాకృష్ణ అభిప్రాయం.

"కాదని నేనడం లేదుగాని, మార్పుకోసం ప్రయత్నించాలి కదా.... ఇదిగో ఇక్కడేవున్నాడుగా మన శ్యామం. ఇలాంటి మేధావులు తమ పత్రికల ద్వారా మార్పుకోసం కృషి చేస్తే బాగుంటుంది..." గోవిందరావు తేల్చేసినట్లు చెప్పాడు.

"మార్పు రావడం అనుకున్నంత సులభం కాదు. భౌతిక పరిస్థితులు మారితేనే, మనుషులు కూడా మారతారు. అంతేగాని, మనుషులు మారాలి-మారాలి అని ఎంత మొత్తుకున్నా ప్రయోజనం వుండదు. అంటే విన్నే టూకీగా నేనిలా అంటాను. అంతరాలు తొలగినప్పుడే, అంతర్యాలు కూడా మారతాయి. ఎందుకిలా అంటున్నానంటే, ఈ రెండూ పరస్పరాధార భూతమైనవి కాబట్టి- ఆకర్షణకులోనై, వయసులో వున్న వాళ్ళు కొందరు అందమైన అబ్బాయినో, లేక



# అంతరాలు-అంతర్యాలు

అందమైన అమ్మాయినో చూచి మనసు పారేసుకుంటారు. కాని జీవితంలో ప్రవేశించేటప్పుడుగాని, ఆ మనసు ఎన్ని బంధాల మధ్య, ఇనుప గోడల మధ్య బందీగా వున్నదో గ్రహించ లేరు. చిన్న పిల్లల విషయంలో నే గాదు, యవ్వన దశలో ప్రవేశించిన యువతీ యువకుల మనస్సులను కూడా నేను "లేత మనస్సులే" నంటాను...." శ్యామం గంభీరంగా చెప్పిన ఈ మాటలు అతడి మిత్ర బృందంమీద కన్నా, సరోజమీద ప్రభావం కలిగించాయి. శ్యామంగారి మాటలు అక్షర సత్యాలా అన్నట్టు ఆశ్చర్యపోతూ చూచింది. ఎందుకోగాని, తనకు తెలియకుండానే తన మనస్సు కలుక్కుమంది. ఆమె లేత హృదయంలో ఎక్కడో ఒకమూల కించిత్తు నిరాశ చోటు చేసుకుంది.

"ఇంతకూ మీరనేది, మనిషి మనసుకన్నా, భౌతిక పరిస్థితులకే ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలంటారు... అవునా...?" రాధాకృష్ణ ప్రశ్న.

"కరెక్ట్... ఎందుకంటే, మన ఈ సమాజంలో మనిషికిగాని, మనసుకుగాని ప్రాధాన్యం లేదు. మనిషికి మనసుతో పనేలేదు. మంచి, మానవత, మమత-వంటి పదాలకు అర్థం తెలియని రోజులివి. స్వార్థం కోసం తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, మంచిని, మానవతను పణంగా పెడుతున్నాడు మనిషి. ఇలాంటి దశలో అభ్యుదయ కరమైన మార్పులు తీసుకురావడం ఎంత కష్టమో ఊహించుకోవచ్చు...." అని శ్యామం వివరించాడు.

"అయితే, మన సమాజం ఇంత కల్మషంతోను, కళ్ళలంతోను నిండివుందన్న మాట..." రాధాకృష్ణ కొద్దిగా ఆవేశంతో నే అన్నాడు.

ఈ మాటలు విన్న తర్వాత మోహనరావు నిట్టూర్పు విడిచాడు.

"ఏమో అనుకున్నాను గాని మీరు గట్టివారే...." అన్నాడు గోవిందరావు.

"గురువుగారి దగ్గర నేర్చుకోవలసిన విషయాలు ఇంకా చాలా వున్నాయనుకుంటాను," ఇది రాధాకృష్ణ వ్యాఖ్య.

ఈ వ్యాఖ్య లేవీ సరోజ చెవిలో పడలేదు. కాని ఎదురుగానే కూర్చునివున్న శ్యామం, ఎన్నటికి అందుకోలేనంత, అనంత దూరంలో వున్నట్టుగా తలపించింది సరోజ హృదయానికి. ఆమెకు తెలియకుండానే ఆరాధనాపూర్వకమైన గురుభావం చోటు చేసుకుంది. అది, ఓ విద్యార్థినిలో వుండే భక్తిపూర్వకమైన గురుభావం కాదేమో! భక్తికి, ఆరాధనకు గల వ్యత్యాసం కూడా ఎంతో సూక్ష్మమైనదే గదా మరి!

ఇంతలో బయటనుంచి శ్యామంగారు అన్న పిలుపు వినబడింది. "కమిన్" అని ఆహ్వానించాడు శ్యామం. యువతీ యువకులు ఇద్దరు ప్రవేశించారు.

"హల్లో.... మీరా.... ప్రసాద్‌గారు, రండి. అమ్మా మీరు కూడా..." అని నిలబెట్టి వున్న రెండు ఫోల్డింగ్ చైర్స్ తెచ్చి వేశాడు శ్యామం. మిత్ర బృందానికి, సరోజకు ఆ వచ్చిన అతిథులను పరిచయం చేయడం ముగిసింది.

"ఆఁ... ఏమిటి విశేషాలు... అంతా సెట్‌రైట్ అయినట్లేనా...?" శ్యామం ప్రశ్న.

"ఏదో.... మీ దయవల్ల అంతా సవ్యంగానే నెరవేరింది..." ప్రసాద్ వినయంతో చెప్పాడు.

"వాట్.... నిజంగానా.... అయితే, త్వరలో కాబోతున్న నూతన వధూవరులకు- సారీ- దంపతులకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు...." అంటూ మిత్ర బృందం వైపు తిరిగి... "మిత్రులారా ఓ శుభవార్త. ఈ యువతీ యువకులు కులాంతర వివాహం చేసుకోబోతున్నారు...." అని ఎనౌన్స్ చేశాడు శ్యామం.

"గుడ్ ఐడియా. హార్టీ కంగ్రాచ్యులేషన్స్ ప్రసాద్‌గారూ!" అన్నాడు చిరునవ్వుతో మోహనరావు.

"అభ్యుదయ కరమైన మార్పు రావడానికి ఇలాంటి వివాహాలు దోహదిస్తాయి కదండి..." అన్నాడు రాధాకృష్ణ.

"ఎస్....అంతేకాదు. సమాజంలో సమత్వం, సమైక్యత, అభ్యుదయం పెంపొందాలంటే ఇటువంటి మార్పు ఎంతో అవసర మంటాను. ఇకనుంచి దీన్ని "అభ్యుదయ వివాహం" అని పిలువదలుచు కున్నాను.... బాగున్నదా నా అభిప్రాయం...?" అని ప్రశ్నార్థకంగా చూచాడు శ్యామం.

"భేషుగ్గా వుందండి..." రాధాకృష్ణ మెచ్చుకోలు వ్యాఖ్య.

"గుడ్.... ఇంతకూ ఈ ఉడ్ బీ దంపతుల కథ మీకు తెలియదు కదూ.... అదే చెప్పబోతున్నాను. ఈయన పేరు ప్రసాదరావు. గ్రాడ్యుయేట్. ప్రభుత్వోద్యోగి. ఆస్తిపాస్తులు లేవు. తల్లి, తండ్రి వృద్ధులు. ఈతడే జ్యేష్ఠ పుత్రుడు. తమ్ముడిని, చెల్లెలిని చదివించడంతో పాటు కుటుంబ పోషణ కూడా ఈయనదే. ఓ చిన్న ఇంట్లో అద్దెకుంటున్నారు.

ఇక ఈమె విషయం.... పేరు సౌజన్య. గ్రాడ్యుయేట్. వీరి కుటుంబానికి కూడా ఆస్తిపాస్తులు లేవు. తండ్రి ప్రభుత్వోద్యోగి. ఈమెకు ఇద్దరు అన్నయ్యలు, ఒక చెల్లాయి వున్నారు. అన్నయ్య లిద్దరికి వివాహా లైనాయి. ఈ ఊళ్లోనే వేరుగా కాపురముంటున్నారు. ప్రస్తుతం సౌజన్య వివాహం పెద్ద సమస్య. అన్నయ్యలిద్దరూ కలసి కొంత డబ్బు లోన్ తీసుకుని చెల్లాయి పెళ్ళికి ఇస్తామన్నారు. వీరి తండ్రిగారు కూడా లోన్ తీసుకునే ఉద్దేశంలో వున్నారు. పెళ్లి సంబంధాలు వెదకడం ప్రారంభించారు. అయితే ఈ గ్రాడ్యుయేట్ సౌజన్యకు మరో గ్రాడ్యుయేట్‌నైనా వెతకాలి కదా. ఈ రోజుల్లో కట్నం కోరని వారెవరున్నారని. ఒకవేళ కట్నం ఇచ్చినా సరిపోతుందా. అన్ని లాంఛనాలు సక్రమంగా జరగాలంటే మరెంతో డబ్బు కావాలి. పెళ్లి ఖర్చులకు ఎంతయ్యేది ముందుగానే అంచనా వేయడం కష్టం. ఎన్ని వేలో వుంటేగాని ఈ సౌజన్యగారు






గడప దాటదన్న మాట. వేలకు వేలు డబ్బు తీసుకు రావడం, వీరివంటి సామాన్య కుటుంబీకులకు ఎలా సాధ్యమో చెప్పండి...?"

"సాధ్యం కాదుకదా...." మోహనరావు అన్నాడు.

"అవును కదా.... మరి ఈ సౌజన్య పెళ్ళి సమస్య ఎలా పరిష్కారమయ్యేట్లు...? పెళ్ళి చేయకుండా ఎంత కాలమని ఆపగలరు... ఎలా సాధ్యం...." శ్యామం ప్రశ్న.

"నిజంగా ఇది చిక్కు సమస్యే..." రాధాకృష్ణ వ్యాఖ్య.

శ్యామం వివరించా డిలా–

'ఈ సమస్యకు పరిష్కారం ఒక్కటేవుంది. వినండి చెబుతా. ఒక కుటుంబంలోని పెద్దలు తమ అబ్బాయిలకు కట్నాలు తీసుకునేటప్పుడు ఎంతో సంబర పడతారు. పెద్దకట్నం వచ్చేవరకు పెళ్ళిమాట ఎత్తరు. కాని, వారింటిలో ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయవలసి వచ్చినప్పుడు మాత్రం దిగజారిపోయి, కట్నాల పిశాచాన్ని దుమ్మెత్తి పోస్తారు. మరి ఇలాంటి వాళ్ళను ఏమనాలో మీరే చెప్పండి. అందుచేత, నేను చెప్పేదేమంటే, మొదటగా ప్రతి కుటుంబంలోని పెద్దలు తమ అబ్బాయిలకు కట్నాలు తీసుకోకుండా వుంటే, అవతలివాళ్ళు కూడా తమ కుటుంబంలోని అబ్బాయిలకు కట్నాలు ఆశించకపోవడమనేది సాధ్యపడుతుంది. ఇదొకపద్దతి...'

మోహనరావు అడ్డువచ్చి,... 'ఆపవయ్యా నీ ఉపన్యాసం. ఈ డొంక తిరుగుడంతా దేనికట. అబ్బాయిలు, అమ్మాయిలు ధైర్యంగా ముందుకొచ్చి కట్నాలు, కులాలు బెడదలేకుండా నచ్చినవాళ్ళను పెళ్ళిచేసుకుంటే సరిపోదూ. అప్పుడీ సమస్యలే వుండవుగా... అని తేల్చిపారేశాడు.

'మాటలు ఆచరణలో పెట్టడం ఊహించినంత సులభంకాదు. చూడరాదూ, ఈ ప్రసాద్, సౌజన్యల విషయం ఏమైందో .... నన్ను పూర్తిగా చెప్పనివ్వరేఏంటి....' అన్నాడు శ్యామం.

'చెప్పుబాబూ, నిన్నెవ్వరూ ఆపలేదులే...' అన్నాడు నవ్వుతూ గోవిందరావు.

ఈసారి శ్యామం సరోజ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ చెప్పడం ప్రారంభించాడు.

'ప్రసాద్, సౌజన్య ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు. వీరి మధ్య సాన్నిహిత్యం ఎలా ఏర్పడిందో వారికే తెలియాలనుకోండి. అదంతా ప్యూర్లీ, వారి పర్సనల్ విషయం...' అంటూ మందహాసం చేశాడు శ్యామం యధాలాపంగానే. ఈ మాటలు వినగానే సరోజ వదనంలో కొత్త కాంతులు ప్రసరించినట్లయింది. అప్రత్నంగానే కనురెప్పలల్లార్చి ముఖాన్ని కొద్దిగా ప్రక్కకు తిప్పుకుంది. అదే సమయంలో ఆమె సోయగాల మధురాధరాల ప్రకంపనం చిరునవ్వులో కలసి మాయమైంది. ఈ అమాయకపు సిగ్గు దొంతరలను శ్యామం పసికట్టకపోలేదు. కాని దాన్ని సీరియస్‌గా పట్టించుకోలేదు.

అంతటితో శ్యామం చూపులు సరోజ మీదనుంచి, రాధాకృష్ణవైపు మళ్ళాయి. 'ఇకపోతే, వీరిద్దరు ప్రేమికులై వివాహం చేసుకుందామనుకున్నారు. కట్నం అక్కరలేదన్నాడు మన ప్రసాద్. అంతవరకూ బాగానే వుంది. అప్పుడు, కులం అనే మీరో గడ్డు సమస్య అడ్డు వచ్చింది. ప్రసాద్ వచ్చి నాకు పూర్తి విషయాలు చెప్పాడు. తప్పకుండా సహాయపడతానని వాగ్దానం చేశాను. వీరి ఆఫీసులో పనిచేసే మరో ఉద్యోగిని, వీరి ప్రేమ వ్యవహారం గురించి సౌజన్య తల్లిదండ్రులకు చెప్పింది. పెద్దవాళ్ళు నిగ్గదీశారు. ఉద్యోగం మాన్పించేస్తామన్నారు. ప్రసాద్ గురించి వాళ్ళ ఆఫీసరకు ఫిర్యాదు చేశారు. సౌజన్య అన్నయ్యలు బ్రూస్లీ పోజులో మా ఆఫీసు కొచ్చి నన్ను బెదరించారు. అప్పుడు నేనన్నాను.మి చెల్లెలు, ప్రసాద్ కలసి పదిమంది సమక్షంలో పెళ్ళి చేసుకుంటాము అని చెబితే, వారి పెళ్ళి జరిపించి తీరుతాను అని బల్ల గుద్ది మరి చెప్పాను.

'మీరు చేయలేరు' అని వాళ్ళు సవాలు చేశారు. 'చేసి తీరుతాను', అని నేను ప్రతి సవాల్ విసిరాను. 'సరే చూద్దాం' అంటూ వెళ్ళిపోయారు. చివరకు ఏమైనదో తెలుసా. ఈఅమ్మాయిగారి తల్లిదండ్రులు, అన్నయ్యలు దిర్ఘాలో చనలో

పడ్డారట. వారా పెద్ద కట్నాలు ఇవ్వలేరు. ఇటు చూస్తే ఈ కుర్రాడు గ్రాడ్యుయేట్. పైగా ఉద్యోగి. కట్నం ఇచ్చినా నిరుద్యోగికిచ్చేకంటె, కట్నం లేకుండా ఉద్యోగికిచ్చి పెళ్ళి చేయడమే మేలనుకున్నారు. అంతేకాదు. వారి దృష్టిలో ఇదే లాభసాటి బేరంగా తోచింది. పైగా, ఈ వ్యవహారం వెల్లడైపోయింది. ఇప్పుడీ ప్రసాద్‌ను కాదంటే సౌజన్యకు మళ్ళీ సంబంధాలేవీ ఎక్కువేమోనని భయపడ్డారు. వారి మనసు మారడానికి ఇదొక ముఖ్య కారణం అనాలి. అంతటితో వారి ప్రగల్భాలు తగ్గిపోయి, ప్రసాద్‌ను, అతని తల్లిదండ్రులను కలుసుకుని ఈ వివాహానికి అంగికరించినట్లు చెప్పారు. ప్రస్తుతానికి వీరి వ్యవహారం ఈ దశకు చేరింది. చూచారా ఎంత రాద్ధాంతం జరిగిందో. ఈ విషయం చెప్పడానికి వీరిద్దరూ వచ్చింది...., అంటూ ప్రసాద్‌వైపు తిరిగి 'ఇక మి భవిష్యత్ కార్యక్రమం చెబితే ఆ ప్రకారమే చేస్తాను' అన్నాడు శ్యామం.

ప్రసాద్ సౌజన్యవైపు చూశాడు. సౌజన్య సరోజ వైపు చూచింది. సరోజ ఎంతో తృప్తిపడుతూ నవ్వింది. ఆ నవ్వులో చెప్పలేని ఆనందం మిళితమై వుంది.

'శ్యామంగారూ, మిరే పెద్దగా వుండి, వీరి వివాహం జరిపించేయండి....' అని సరోజ తన మనసులో మాట వెల్లడించింది. శ్యామం మరోసారి సరోజ వైపు చూశాడు.

'ఇంత పెద్ద భారం, నావంటి చిన్నవాడి మిద వేయడమా....' అన్నాడు.

'అయ్యో, నీవే కదా సూత్రధారివి. ఈ సూత్రధారణ కార్యక్రమం కూడా నీచేతి మిదుగానే కానిచ్చేస్తే, కథ శుభాంతమవుతుంది కదా....' గోవిందరావు సలహా పూర్వకంగా విజ్ఞప్తి చేశాడు. అందరూ నిష్క్రమించారు. సరోజ ఒక్కతే కూర్చుని వుంది. శ్యామం ఏమి మాట్లాడలేదు. సరోజ కూడా ఎందుకో బిడియపడింది. తన స్థాయికి మించి సలహా చెప్పానేమోనని భావించింది. 'వెళ్లొస్తానండి....' చెప్పి లేచి చరచర వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్న సరోజను, రెండు క్షణాలు చూచిన తర్వాత శ్యామం తన పనిలో నిమగ్నమయ్యాడు.

## 5

'ఏమండోయ్, మిమ్మల్నే. ఎక్కడండి....' అంటూ సుబ్బమ్మగారు ముందు గదిలోకి వచ్చి భర్తను పిలిచి.... 'అమ్మాయి మళ్ళీ మనవడినే కన్నది...' అని ముఖం చాటంత చేసుకుని చెప్పి, వెంటనే గిర్రున తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

ఈ శుభవార్త వినగానే సుబ్బారావుగారి వదనం కూడా వికసించింది. చదువుతున్న పేపరు ప్రక్కన పెట్టి, కుర్చిలోంచి, చివాల్న లేచారు. ఏదో వెదకబోతున్నారు. సంతోషంతో ఆయన హృదయం పొంగిపోయినందువల్ల కాబోలు, దేనికోసం వెదుకుతున్నది ఆయనకే అర్థం కాలేదు.'




ఇంతలో సరోజ వచ్చి ... 'నాన్నా, నాన్నా, బాబు ఎంచక్కా వున్నాడనుకున్నావు ...పండు... బుగ్గలు ఉబ్బి బూరెల్లా వున్నాయి. చిన్నిగడ్డం, చిన్ని ముక్కు. కళ్ళు మూసుకునే ఏడుస్తున్నాడు భడవ. అచ్చు నా పోలికే నాన్నా ...' అంది ఆనందంతో ఆయాసపడుతూ.

'అలాగామ్మా! బాబిగాడు అంత బాగున్నాడా ... అవును మరచాను. ఉత్తరం ... ఉత్తరం రాయద్దూ అల్లుడికి ... ఏది కార్డు ... ఇందాకటి నుంచి ఉత్తరం ముక్క కోసమే వెదుకుతున్నాను కాబోలు. నా మతి ఇక్కడ లేదు ...' అంటూ కార్డుకోసం వెదికి, అదెక్కడా కనిపించనందుకు చికాకుపడి, ఇప్పుడేవెళ్ళి తీసుకొస్తానంటూ లాల్చీ, ఖండువా చేతుల్లోకి తీసుకున్నారు. ఆదరాబాదరాగా చెప్పుల్లో కాళ్ళు దూర్చారు.

'నాన్నా, నేను కూడా అన్నాయిలకి రాస్తాను. నాకూ తీసుకురండి...' అంటూ పెద్దగా అరచినట్లు చెప్పింది సరోజ. గుమ్మంలోనే నిలబడింది నాన్న రాక కోసం నిరీక్షిస్తూ. పోష్టాఫీసు అక్కడికి దగ్గరే. మూడు నిమిషాల్లో సుబ్బారావు గారు ఉత్తరాలు చేత బట్టుకుని తిరిగి రావటం చూసింది సరోజ. ఇంటికి తిరిగి వస్తున్న నాన్నను చూస్తూ, తాను అన్నయ్యలకు ఏమేమి వ్రాయాలో ఊహించుకుంటోంది.

ఇంతలో, లోపల నుంచి తల్లి పిలుపు వినిపించింది. కాని ఉత్తరాల కోసం నిరీక్షిస్తున్న సరోజ గుమ్మంలోంచి కదలలేదు.

'అమ్మాయ్, సరోజా! త్వరగా రావే ...' అంటూ తల్లి గదిలోంచి ముందు గదిలోకి వచ్చింది. తల్లి వదనం వివర్ణం కావటం చూచిన సరోజ విస్తుపోయి ... 'ఏమిటమ్మా?' అని ప్రశ్నించింది. అప్పటికే సుబ్బమ్మగారి కంఠస్వరం మారిపోయింది. కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి.

'ఏరి, మి నాన్న ఏరి?' అని గాద్గదిక స్వరంతో అడిగింది.

'వస్తున్నారే ...' కూతురు బదులు పలికింది.

'నాకేదో భయంగా వుందే. శాంత అదోలా వుంది. పిలిస్తే పలకడంలేదు ...' ఇలా అంటూ ఉండగానే ఆమె కళ్ల వెంట నీళ్ళు జలజలా రాలాయి. పమిట కొంగుతో కళ్లొత్తుకుంటూ లోపలికి తిరిగి వెళ్ళిపోయింది. ఆమె వెంట సరోజ కూడా వెళ్ళింది.

గదిలో నులక మంచం ప్రక్కన భయం, ఆందోళన ముప్పిరిగొన్న చూపులతో నిలబడి వుంది. ఆమెలో కూడా ధైర్యం సడలిపోయింది. ఆ ప్రక్కనే శాంత పిల్లలిద్దరూ ... 'అమ్మా! అమ్మా!' అంటూ ఏడుపు ప్రారంభించారు.

శాంత వదనం పాలిపోయింది. పాదాలు బిర్ర బిగుసుపోతున్నాయి. కళ్ళు మూతబడే వున్నాయి. తల పక్కకు వాల్చింది. చేతులు చప్పబడి అచేతనమైనాయి.

మంత్రసానికి ఏమి చేయడానికి తోచడంలేదు. వెళ్ళి, వెంటనే లేడీ డాక్టరును తీసుకు వద్దామనుకుంది. కాని, కాళ్ళు కదలడంలేదు. ధైర్యం ఇంకా సడలి పోతోంది.

'అమ్మా! శాంతా! ... ఇటు చూడవే ...' అంటూ తల్లి - 'అక్కా చూడవే ఓ సారి' అంటూ సరోజ, రోదించడం ప్రారంభించారు.

శాంత తలను, మంత్రసాని అటు ఇటు ఆడించి చూచింది. ముక్కు దగ్గర వేలు పెట్టి చూస్తే శ్వాస ఉన్నట్లు లేదు. నాడి చూచింది .... వణుకుతున్న చేతులతో, కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ ప్రక్కకు తప్పుకుంది.

సుబ్బమ్మగారు, సరోజ, రఘు, రాజు బావురుమన్నారు. గగ్గోలు పెట్టారు. అప్పటికే, లోపలికి వచ్చి, ఈ అరుపులు, ఆక్రందనలు విన్న సుబ్బారావుగారు గది

# అసలైన తెలుపు ఏమిటో... ప్రపంచానికి చూపండి

# డెట్



## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!




డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ. దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!

Shilpi DM 9A/84 Tel.

# సుభాషితాలు

యః ప్రీణయేత్ సుచరితైః పితరం స పుత్రో
యద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్ కళత్రమ్
తన్మిత్ర మాపది సుఖే చ సమక్రియం య
దేతత్ త్రయం జగతి పుణ్యకృతో లభంతే




ఏ పుత్రుడు తన సచ్చరిత్రతో తండ్రిని సంతోషింప చేస్తాడో వాడే పుత్రుడు, భర్త యొక్క హితాన్నే కోరు భార్యయే భార్య, ఆపద యందు, సంపద యందు గూడా సమానంగా సఖ్యాన్ని చూపు మిత్రుడే మిత్రుడు, ఈ ముగ్గురిని లోకంలో పుణ్యం చేసిన వారే పొందుచున్నారు.

పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవ చక్రవాళమ్
నాభ్యర్థితో జలధరోऽపి జలం దదాతి
సంతః స్వయం పరహితే విహితాభియోగాః




సూర్యుడు ఎవరూ కోరకయే తామర కొలనును వికసింప చేస్తున్నాడు, చంద్రుడూ కలువపూల సముదాయాన్ని వికసింప చేస్తున్నాడు, అట్లే మేఘుడు గూడా నీళ్ళనిస్తున్నాడు. సత్పురుషులు పరులకు మేలు చేయుటలో స్వయంగానే ఆసక్తి గలవారు.

—ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ.

## అంతరాలు-అంతర్యాలు

వెలుపలే కుప్పగా కూలబడిపోయారు. తెచ్చిన ఉత్తరాలు చేతిలో నుంచి తప్పుకుని చెల్లా చెదరుగా పడ్డాయి. క్షణం క్రితం వరకు ఆనందంతో పరవశులైన సుబ్బారావుగారిని ఆ ఉత్తరాలు వెక్కిరిస్తున్నట్లుగా వున్నాయి.

అవును ... శాంత లేదు ... కష్టాలు, బాధలు తప్పించుకుని శాశ్వతంగా కన్నుమూసింది.

మంత్రసాని వణుకుతున్న స్వరంతో నే చెప్పింది ... 'బలహీనం వల్లనే ఇలా జరిగిందండీ ... అసలే అనారోగ్యంగా వున్నది. అందుకు తోడుగా, శరీరంలో తగిన రక్తం లేదు. పాపం . ఎంతో ప్రయాసతో నే ప్రసవించింది. కాని, కన్నబిడ్డను కళ్లారా చూసుకోడానికైనా నోచుకోలేదు...' అని నిట్టూర్పు విడిచింది.

శాంత వంటివారు, పేదరికం వల్ల అనారోగ్యంతో, చావు, బ్రతుకుల మధ్య కృశించిపోయి, చివరకు ఇలాంటి విషాదకరమైన మరణాలకు ఎందరు గురి అవుతున్నారో ఎవరి కెరుకో?

సుబ్బమ్మగారి కడుపు కోతకు అంతులేదు. పెద్దగా శోకాలు ప్రారంభించింది.

'అమ్మా శాంతా ... నాకింతటి కడుపు కోత పెడతావా తల్లీ . నేనేం పాపం చేశానే ... నీవెంత కృశించి పోతున్నా, 'నా భర్త దేముడు అదే నాకు పదివేలు ...' అని చెప్పేదానివి కదే తల్లీ . . నన్నెలా బ్రతకమంటావే ఇప్పుడూ . పేదవాళ్లకు ఆయుష్షు తీరక ముందే చావు రాసి పెట్టావా భగవంతుడా ... అయ్యో దేముడా జాలి, దయ లేదా ... అమ్మా శాంతా ఒక్కనాడైనా నిన్ను సుఖపెట్టలేక పోయాము గదే తల్లీ . . నీ జీవితం కష్టాలపాలైంది గదే మా అందరికి ఇంత కడుపు కోత పెట్టి వెళ్లిపోయావా తల్లీ ..' ఆ తల్లి గుండెలు బ్రద్దలయ్యేట్లుగా పెద్దగా రోదిస్తోంది తల్లిని కౌగలించుకున్న సరోజ గజ గజ వణకిపోతోంది నాన్న వచ్చినది లేనిది చూడలేదు పసివాళ్లు మంచం మీద, అమ్మమీద పడి ఏడ్చే సత్తువ లేకపోయినా, అలసట వచ్చినా, అయోమయ స్థితిలో వుంటూ విలపిస్తున్నారు

కూలబడిపోయిన వృద్ధుడు సుబ్బారావు గారిలో ఆ సమయంలో చైతన్యం వున్నదంటే ఎవరూ నమ్మరు. కుడి చేతి వ్రేళ్ల మధ్య కళ్లజోడు నేలకు ఆనుకుని వుంది కన్నీటిధారతో రొమ్ము భాగంలో వున్న లాల్చీ తడచి ముద్దయింది. కళ్ళు పెద్దవి చేసుకుని సూటిగా నేలమీదకు చూస్తున్నారు . దేన్ని ..? . అయోమయాన్ని అంధకారాన్ని చూస్తున్నది దేన్నో ఆయన కళ్లకు తెలియదు ఆలోచిస్తున్నదేమిటో ఆయన మెదడుకు తెలియదు ఆక్రందనగా వినపడుతున్నా వెర్రి ఆలోచనల మధ్య ఆయనకేమి బోధపడటంలేదు

'సుబ్బారావు నీవు చచ్చిపోయావు .. నీవు నిజంగానే చచ్చిపోయావు ... అసలు నువ్వెందుకు బ్రతుకుతున్నావు నీకు, నీ బ్రతుక్కు విలువ వుందా . పరువుందా. ఇంత విషం పుచ్చుకుని చావరాదూ ఎవర్ని సుఖపెట్టావు నీ జీవితంలో చెప్పు ? ... చెప్పు ?? . నీ వెర్రి మొర్రి చేష్టలకు, పిచ్చి పనులకు నీతో పాటు నీ కుటుంబం యావత్తూ సర్వనాశనమై పోయింది గదా ... ఛీ .. ఎందుకు నీ బ్రతుకు నువు కష్ట దశలో వున్నావని, ఎవడైనా ఒక్క పైసా ఇచ్చాడా చెప్పు ... కన్నావు, పెంచావు. ఒక అయ్య చేతిలో పెట్టావు పుట్టినింట, మెట్టినింట ఎక్కడా సుఖపడలేదే నీ కూతురు చివరికి ఇదా ఆమె రాత. ఇదా ఫలితం ... ఛీ చేతకాని వాడివి బిడ్డల్ని ఎందుకు కన్నావయ్యా నీవేమి చేయలేవు. ఎందుకూ కొరగావు... ఏమి చేయలేవు .. అవును .. అవును ...' సుబ్బారావు ఆలోచనలతో పాటు పెదవులు కూడా కంపిస్తూ పలికాయి .

'ఏమి చేయలేను. అవును ఏమి చేయలేను అమ్మా శాంతా. దీనంతటికీ నీ తండ్రేనమ్మా కారకుడు. ఈ కుటుంబానికి ఇంతటి దుర్గతి పట్టడానికి నేనేనమ్మా కారకుడిని ...' అంటూ బావురుమని ఏడవడం ప్రారంభించారు. గుండె తరుక్కుపోతోంది. ఆపుకోలేని ఆక్రందన. మెల్లగా లేచి గదిలోకి వెళ్లారు. సుబ్బమ్మగారు, సరోజ, పిల్లలు, వారితో పాటు సుబ్బారావు గారు ... అందరూ గగ్గోలు పెట్టారు ఒక్కసారిగా.

(ఇంకా ఉంది)




వచ్చాడు.

"మీరు సింహాచలం దిగాక మాట్లాడుదాం మాష్టారు. మాకు అక్కడ పావుగంట రెస్టు ఉంటుంది. టిక్కెట్లు కట్ చెయ్యాలి. ఏఁవీ అనుకోకండేం?!" అన్నాడు సూర్యం నమ్రతగా.

నిజమే మరి!

ఉద్యోగం. పని మానేసి తనతో మాట్లాడుతుంటే ఎలా?

నేను ఆలోచనల్లో ఉండగానే బస్సు సింహాచలం చేరుకుంది. ప్రయాణీకులు ఒక్కొక్కరే దిగుతున్నారు.

ఏఁవిటి!? ఇంత నెమ్మదిగా దిగుతున్నారనుకుంటూ బస్సు విండో నుండి బైటకు చూసాను.

స్క్వాడ్ టిక్కెట్లు చెక్ చేస్తున్నారు. సూర్యం వారి ప్రక్కన చేతులు కట్టుకు నిలబడ్డాడు.

నాకెందుకో భయం వేసింది.

మేం టిక్కెట్లు తీసుకోలేదు. కాదు సూర్యం వద్దన్నాడు. పర్లేదన్నాడు. కానీ, ఇప్పుడెలా? వాళ్ళేమంటారు? ఫైన్ వెయ్యరూ?

సూర్యం ప్రక్కనే ఉన్నాడు కదా! పర్లేదు. అనుకున్నాను మళ్ళా. అందరూ దిగిపోయారు. ఆఖరున మేం దిగాం.

"టిక్కెట్లు ఇవ్వండి!" అన్నాడతను.

నాకు నోట మాట రాలేదు. సూర్యం వైపు చూసాను. నన్ను చూసి మొహం తిప్పుకున్నాడు. ఏం? ఎందుకబ్బా! సూర్యం అలా ప్రవర్తిస్తున్నాడు.

"మొత్తం ఏడుగురా! ఏం? మాష్టారూ! పెద్దవారు. మీరు కూడా ఇలా చెయ్యటం బాఁవుందా? టిక్కెట్టు లేని ప్రయాణం నేరమని తెలీదూ?!" అతను గద్దించాడు.

"కండక్టర్....." ఏదో చెప్పబోయాను.

"నేను ఆఖరికి టిక్కెట్టు....టికెట్టు అని పదిమార్లు అర్చుకుంటూ తిరిగాను సార్. వీళ్ళ దగ్గర వాళ్ళందరూ టిక్కెట్లు తీసుకున్నారు. వీళ్ళు మాత్రం తీసుకోలేదు." సూర్యం స్క్వాడ్‌తో అంటున్నాడు.

అవాక్కయి పోయాను.

మా ఏడుగురికీ మనిషికి పదిహేను రూపాయల చొప్పున వసూలు చేసి రశీదు ఇచ్చారు స్క్వాడ్.

ఏడు రూపాయల్తో పోవాల్సింది. నూట అయిదు రూపాయలు పోయాయని మా ఆవిడ తెగ బాధ పడింది.

ఏం చెయ్యను? పరువూ పోయింది. డబ్బూ పోయింది.

చాలా మంది మమ్మల్నే గమనిస్తున్నారు. కొంతమంది నవ్వుతున్నారు. కొంతమంది మమ్మల్ని దొంగల్లా చూస్తున్నారు.

గబగబా సూట్‌కేస్ అందుకొని ముందుకు దారి తీసాను. నా వెనుక ఫాలో అయ్యారు మావాళ్ళు.

హోటల్లోకి వెళ్ళి కూర్చున్నాం.

టిఫిన్ చేసి బైటకు వచ్చాం.

కండక్టర్ సూర్యం ఎదురయ్యాడు.

# భేదదృష్టి

## ధర్మపథం



దైవభక్తి ఎక్కువగా ఉండవచ్చు. నిస్సంగులైన సాధువుల యెడల సన్న్యాసుల పట్ల ఎంతో గౌరవం ఉండ వచ్చును. సర్వ మానవుల యెడల ప్రేమ, అభిమానం ఉండ వచ్చును. కాని, ఎక్కువ తక్కువ భావాన్ని చూపకుండా ఉండేవారు మాత్రం చాలా అరుదు. శ్రీమంతులు దరిద్రులనూ, బలవంతులుబలహీను లను హీనంగా చూడడం తరచుగా కాన వస్తున్నది. దానికి అహంభావం ప్రధాన కారణం. సర్వ వ్యాపకుడగు భగవ దంశఅందరి లోనూ ఉన్నదని గ్రహించాలి.

ఒక ప్రభువు దైవభక్తిపరుడు. సాధువులన్నా సన్యాసులన్నా ఆతనికి గొప్ప గౌరవం. వారు లౌకిక బంధాలకు లోనుగాక జనులకు సన్మార్గాన్ని బోధించే మహనీయులని ఆయన విశ్వాసం. ఆ రాజు నివసిస్తున్న నగరానికి ఒకప్పుడు ఒక సాధువు వచ్చాడు. ఆయన గొప్పతనాన్ని గురించి జనులు చెప్పుకొనసాగారు. ఆ సాధువు ఆ వూరికి వచ్చిన సంగతి రాజుగారికి తెలిసింది. ఆయన తన అమాత్యుని ఆ సాధువు వద్దకు పంపి, ఎంతో గౌరవంతో తన భవనానికి రప్పించాడు.

ప్రభువు ఆ సాధువును పూజించి, ఆయన వలన ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. ఆయనకు విలువైన బంగారు జరి పట్టు శాలువను సమర్పించాడు. సాధువుకు దానిపై ఆశ లేదు. దాన్ని తిరస్కరిస్తే రాజు చిన్నబుచ్చుకుంటాడని, ఇష్టంలేక పోయినా స్వీకరించి తననివాసానికి వెళ్ళుతూ ఉండగా,దారిలో ఇతరులను యాచిస్తూ ఉన్న ఒక బీదరాలు కనబడింది. ఆ సాధువు, రాజుగారు తనకు బహూకరించిన ఆ పట్టు శాలువను ఆమెకు ఇచ్చి వేశాడు. ఆమె పరమానంద భరితురాలయింది. నాటితో ఆమె లేమి అంతరించింది.

ఈ సంగతి ఎలాగో రాజు చెవిని పడింది. ఆయనకు సాధువుపై తీరని కోపం కలిగింది. తానెంతో గౌరవంతో ఇచ్చిన విలువైన శాలువను ఒక దరిద్రురాలికి ఇవ్వడం తన్ను అవమా నించినట్లు ఆయన భావించి, ఆ సాధువును తన వద్దకు పిలిపించి "మీకు ఎంతో గౌరవంగా సమర్పించిన శాలువను ఒక బీదరాలికి ఇచ్చి నన్ను అవమానించడం తగునా?" అని తీవ్ర స్వరంతో ప్రశ్నించాడు.

ఆ సాధువు చిరునవ్వు నవ్వుతూ "రాజా! మీరిచ్చిన ఆ శాలువను భౌతిక, బలహీన శరీరాన్ని ధరించిన బీదరాలికి ఈయలేదు. ఆమెలో నాకు కానవచ్చిన సర్వాంతర్యామి అయిన జగన్మాతకు సమర్పించాను. నాకు ఆమెలో ఆ దేవియే కనబడింది" అన్నాడు. రాజు నిర్ఘాంతపోయాడు. ఆయనలోని అహంభావం అంతతో నశించినది.

–బులుసు వేంకట రమణయ్య

## క్షమించండి

"మాష్టారూ!....నన్ను క్షమించండి. అప్పుడు అలా మాట్లాడకపోతే నా ఉద్యోగం పోతుంది. నాట్ కలక్టేడ్ కేసు వ్రాస్తాడు. సస్పెండ్ చేస్తారు. నేనసలు చెకింగ్ అవుతుందనుకోలేదు మాష్టారు!" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"క్షమించండి! మీరెవరో నాకు తెలీదు." అనేసి సూర్యాన్ని తప్పించుకొని రోడ్డు మీదకు వచ్చాను.

"మాష్టారూ!....మాష్టారూ....!" అంటూ నా వెనకే వచ్చాడు సూర్యం. అవమానం నన్ను అతలాకుతలం చేస్తోంది.

కోపంగా ఒక్కసారి వెనక్కి తిరిగి తిట్టెయ్యాలనుకున్నాను.

సూట్‌కేస్ క్రింద పెట్టి గబుక్కున వెనక్కి తిరిగాను.

సూర్యం చేతులు కట్టుకు నిలబడ్డాడు.

సూర్యంను చూస్తూ అలాగే అచేతనంగా నిలబడిపోయాను.

సూర్యం... సూర్యంలా కనిపించలేదు నాకు.

ఆటో డ్రైవర్.... ఆటో డ్రైవర్ నా కళ్ళల్లో మెదిలాడు. చెల్లని వంద రూపాయలు మార్చటం కోసం పాపం! ఆటో కుర్రాడిని మోసం చేసాడు. అతని కష్టాన్ని దోచుకున్నాడు.

కానీ, ఇప్పుడూ....?!

తగిన శాస్తి జరిగింది.

సూర్యం నా వాలకం చూసి వెళ్ళి పోతున్నాడు. మరి, తను క్షమించడని గ్రహించాడు గాబోలు.

"సూర్యం!" అన్నాను ఆనందంగా.

అక్కడే నిలబడి నాకేసి ఆశ్చర్యంగా చూసాడు సూర్యం.

రమ్మన్నట్టు కళ్ళతోనే సైగ చేసాను.

నా మనసిప్పుడు హాయిగా ఉంది. 




### సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ రిటైరైన అనేకులకు మీ సూచన సలహా ఏమిటి?

● రిటైర్‌మెంటు ఉద్యోగం నుంచి గాని- జీవితం నుంచి కాదుగా? ఏదో వ్యాపకంలో వుండకపోతే -మనిషి నిర్వీర్యంగా, తయారయ్యే ప్రమాదం వుంది కల్పించుకుని-ఏదో పని చేస్తూ-ండాలి లేకపోతే తనకి తానే కాదు -చుట్టూ అందరికీ- తలనొప్పిగానో, భారంగానో తయారయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. సలీమ్ అలీని చూడండి - 86 లో పడినా -హిమాలయాల్లోకి ట్రెక్కింగ్‌కి వెడుతున్నారట- మౌంటిన్ క్వాయిల్‌ని గుర్తించి - పట్టుకు రావడం కోసం అదీ జీవితం అంటే

### సి. కె. ఆర్. కొట్వాల

★ కృష్ణ మీద మీకు నమ్మకం వుందా?

● ఎందుకు???

### జి. ఆర్. కాశీబుగ్గ

★ మీ ప్రశ్నావళిలో ప్రేమ అనే పదం తప్ప వేరే గురించి వ్రాయడం లేదు నా కిటువంటి ప్రేమ, దోమ అంటేనే పడదు పరమ చికాకు మీరిటువంటి వాటికి సమాధానం తెలియపరచక పోతే బాగుంటుంది

● ఎవరికి బాగుంటుంది -మీకు! కాని ప్రేమాదోమా అంటే చికాకు లేని వారి మాట ఏమిటి? మన ఇష్టాయిష్టాలు ఒకరిపై రుద్దక పోవడమే (రుద్దాలని వున్నా) నాగరికత

### జి. కె. ఆర్. గంజాం

★ మీరే వర్ణస్తులు?

● చామన చాయ!!

★ ఆడదాన్ని చూస్తే మగాడి కిందుకంత అలుసు?

● తిరగబడే ధైర్యం లేని ఎవర్ని చూసినా - అలుసే

### డి. ఎన్. బి. ప్రొద్దుటూరు

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను అచ్చం గోరింటాకు సినిమాలో లాగే నేను ప్రేమిస్తున్నానని అమ్మాయికి తెలియదు

● జీవితం నుంచే కథలు పుట్టేది ప్రేమించినా 'ప్రేమించానని' చెప్పడానికి చాలా మానసిక ధైర్యం కావాలి ఎక్కడారాని పిరికితనం ప్రేమ దగ్గిర రావడం - సహజమే

### ఎ. కె. హైదరాబాదు

★ ఇరవై ఒకటవ శతాబ్దానికి మనదేశం ఎలా వుంటుందనుకొంటున్నారు?

● నేనుండక పోవచ్చుగాని - ఊహించకలను - ఇలాగే - వుంటుంది?

### ఎన్. బి ఐ. అనంతపురం

★ నేను ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నాను. నచ్చిన అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకోవాలనుకున్నాను జరుగలేదు ఇంతలో పెద్దలు నిర్ణయించిన ఒక సంబంధం కుదుర్చుకున్నాను అది జరిగిన నెలలోగా ఒక అమ్మాయితో పరిచయం అయింది

● పోనీ ఆ అమ్మాయిని వదలి, యీ అమ్మాయిని పెళ్లి చేసుకుంటే - తరవాత యింత కంటే- ప్రేమించతగ్గ అమ్మాయి దొరకదని గ్యారంటీ లేదు మీరే ఆలోచించుకోండి

### ఎమ్. వి ఆర్. ఖాజీపేట

★ కొందరెందు కంత విసుగొచ్చేలా మాట్లాడుతారు

● పైస విలువ తక్కువే కాని ఖాళీ చెంబులో అది చేసేటంత చప్పుడు యింకేదీ చెయ్యదు కదా వీళ్ళూ అంతే - విలువ లేక - వాగడం

### బి. ఎ. ఆర్ కాకినాడ

★ గెడ్డానికి విప్లవానికి అవినాభావ సంబంధం ఏమిటి రామలక్ష్మిగారూ?

● ఏం లేదు విప్లవవాదుల కేనా గెడ్డం వుండేది? బైరాగులకి లేదా? వేదాంతులకి లేదా?!

### ఏ. ఆర్. ఆర్. సికింద్రాబాదు

★ తమరు నా ప్రశ్నకు 5-11 జూలై పత్రికలో జవాబు నిష్పక్షపాతంగా అతిధైర్యంగా యిచ్చినందుకు నా హార్దిక కృతజ్ఞతలు మీ ధైర్యసాహసాలకు మరొకమారు -ధన్యవాదాలు

● మీ సుదీర్ఘమైన లేఖలో స్వీయ నిర్వేదం మరీ ఎక్కువగా వుంది! ఎప్పుడూ రెండు వైపులా ఆలోచించే ప్రయత్నం చెయ్యాలి. మీ అపజయాలకి కారణం పూర్తిగా యితరులనుకోవడంలో అర్థం లేదు. నాది ధైర్యం కాదు, నిజం చెప్పడమే

### కె. ఆర్. ఎన్. గుణుపూరు

★ నేను ఒకరిని ప్రేమించాను కాని ఆమె నన్ను ప్రేమించినదీ లేనిదీ తెలుసుకోవడం ఎలా?

● ఏం తీరా అడిగితే - కాదంటే మీ పౌరుషం దెబ్బతింటుందని భయమా??

### ఎ. డి. బరంపురం

★ భర్తను వదిలేసిన స్త్రీ జీవితం తెగిన గాలిపటం లాంటిదంటారు మరి భార్య వదిలేసిన భర్త జీవితం?

● అతగానికేం? కొత్త పెళ్లికొడుకు!

### బి. ఎ. ఎ. ఆర్. బిలాస్పూరు

★ చదువులు ముఖ్యమా, అందం ముఖ్యమా? జీవిత భాగస్వామిని ఎలా ఎన్నుకోవాలి?

● మీరు అబ్బాయి కనక బాధలేదు రోజుకో రెండు చూపుల చొప్పున అమ్మాయిలని చూసి- ఏది ముఖ్యమో తేల్చుకోవచ్చు! అందంతో పాటు డబ్బు వస్తుంటే - అందం ముఖ్యం అనుకోవచ్చు. చదువుతో పాటు మంచి ఉద్యోగం వస్తుంటే - చదువు ముఖ్యం అని తేల్చుకోవచ్చును □



# దేశం మరీ పాడవలేదు...!

తెన్నేటి నారాయణరావు




జనం జనం ఎక్కడ చూసినా క్రిక్కిరిసిన జనం కార్లకి మాటలకి దేశ ప్రగతికి అడ్డు పడే జనం రాజారావుని రైలు టిక్కెట్ తీసుకోనికుండా జనం వెధవ జనం అదేమిటి? మంచివాళ్ళుండరా! అని మీరు ప్రశ్నించవచ్చు రాజారావు అభిప్రాయ మది

రాజారావు నుదుటి మీద చెమట తుడుచుకున్నాడు వెనక తనని ఎవరో ముందుకి తోసారు ఒళ్ళు మండింది వెనక్కి తిరిగి

దయచేసి ముందుకి త్రోయకండి అని ఇటు తిరిగి చూస్తే పుష్ అన్న బోర్డు కనపడింది తక్కున వెనక్కి తిరిగి సారీ చెప్పాడు రాజారావు తన సెన్స్ ఆఫ్ హ్యూమర్‌కి తనే నవ్వుకున్నాడు రాజారావు వెనకున్నతను బావరహితంగా చూసాడు నవ్వలేని నరుడు అనుకున్నాడు -అదే సినిమా టైటిల్‌లాగా ఉందే అనుకుని చాలా చాలా ఆలోచించాడు కాసేపయిం తరవాత రాజారావు కొంత మంది చేత తిట్లు బడ్డాడు ఎదురుగుండా బుకింగ్ క్లర్క్ సానుభూతిగా చూస్తున్నాడు అదే సానుభూతితో రాజారావుకి టిక్కెట్ ఇచ్చాడు

రాజారావు ఇవతలకొచ్చి కాసేపు ఆబగా గాలి పీల్చాడు ప్రాణం కుదుటపడింది రుసుం లేకుండా ఈ దేశంలో దొరికేదిదొక్కటే మరి స్టేషన్లోకి బయలుదేరాడు అన్ని చప్పుళ్ళు - ఆ చప్పుళ్ళ మధ్య దడ దడ దడ ఫట్ ఫట్ రాజారావు ఎదురుగుండా సామాన్లు పెట్టి ఉన్న బండి - ఆఘమేఘాల మీద వస్తోంది

బండి ముందు మనిషి లేడు బండి మాత్రం వస్తోంది దడ దడా రాజారావు ప్రాణ భీతితో చుట్టూ చూసాడు సామాన్లు ఏవో పెట్టెలు చాలా

ఎత్తుగా పేర్చి ఉన్నయి తోస్తున్న వాడికి తనుగాని ఇతర్నుగాని కనపడే అవకాశంలేదు ఎంక్వైరి అన్న బోర్డు కనబడింది బోర్డు కింద బల్ల ఎగిరి ఆ బల్లెక్కాడు దైవవశాత్తు బల్ల వెనకున్న కుర్చీలో ఎవరూ లేరు బండి దార్ని బండి పోయింది అమ్మయ్య అనుకొన్నాడు

ఎటిక్షన్ ప్లీస్ తనక్కావలిసన రైలు కొద్ది నిమిషాలలో బయలుదేరబోతున్నట్టు ప్రకటన రాజారావు నడకాపి పరిగెత్తడం మొదలు పెట్టాడు పరుగెత్తాడు పరిగెత్తాడు ఠక్కున ఎవరో తనని పట్టుకున్నారు ఆగి పట్టుకున్న వాడిని ఎగాదిగా చూసాడు సటా బర్త అన్నాడు వాడు చింపిరి తలా చిరుగుల బట్టలూ తీక్షణమైన కళ్ళూ ఒక పదేళ్ళుంటాయేమో వాడికి రాజారావుకి చాలా కోపం వచ్చింది గానీ తమాయించుకుని

సట్లూ బర్తలూ దానం చెయ్యడానికి నువ్వేమన్నా రైల్వే మంత్రిగారి పెద కొడుకువా? అన్నాడు కాదు పోట్టరు ఈరిగాడి మనవణ్ణి అన్నాడు ప్రస్తుత పరిస తుల్లో నాది చాలా పెద్ద హోదా సుమా అన్నట్టు చూసాడు వాడు సరే సటు ఇప్పించు అన్నాడు రాజారావు రండి అని బాణంలాగా పరిగెట్టాడు వాడు రాజారావు కూడా ఇందాకటి తన పరుగుని కంటిన్యూ చేసాడు ఆ కుర్రాడు పరిగెత్తి పరిగెత్తి ఒక పెట్టెకి ఎక్కాడు వాడొక తుండు గుడ్డ తీస ఫటన దులిప రాజారావుని చూస రానీండి అన్నాడు ఏమిటన్నట్టు చూసాడు రాజారావు సీటుకి మూడూ బర్తకి ఐదూ అన్నాడు వాడు అప్పుడర్థం అయింది రాజారావుకి వాడడిగేది డబ్బులని వెంటనే డబ్బు తీసచ్చాడు వాడికి రైట్ రైట్ అనుకుని గబ గబా కిందికి దిగిపోయాడు వాడు

ఆ పెట్లో ఇంకా చాలామంది జనం వున్నారు ఒకటే గడబిడగా ఉంది ఇంతలోకి కొంత మంది బలమైన వ్యక్తులు రైల్లో ప్రవేశించి అందర్ని బలవంతంగా దించడం మొదలెట్టారు అక్కడికి ఒక్కణ్ణి నిలవేస అడిగాడు యే హై మిలిట్రీ తుమ్ బాహర్ జావ్ అన్నాడు రాజారావుని బయటికి తోస్తూ వాడు

హతవిధి అనుకున్నాడు రాజారావు సొమ్మొకపోయి శనీ పట్టడం అంటే ఇదే కాబోలనుకున్నాడు యేం దారి గోదారేనా అనుకున్నాడు

ఈ ప్రయాణం అతనికి చాలా ముఖ్యమైనది ఉద్యోగం వచ్చింది వెళ్ళి జాయినవ్వాలి వెళ్ళి తీరాలి సరే ఎలాగయ్యా తను ఎమన్నా మినిస్టరు కొడుకా ఏ ప్లేన్‌లోనన్నా వెళ్ళడానికి ఒక సామాన్యమైన గుమాస్తా కొడుకు ప్రాణం ఉసూరుమనిపించింది ఈ రష్‌లో ఎలా వెళ్ళడం ఎలా? అతని బుర్ర అదే ఆలోచిస్తోంది ఎంత ఆలోచించినా మళ్ళీ అదే ప్రశ్న ఎలా? ఎలా? ఛీ ఛీ

వెదవ రైళ్ళు వెదవ వెదవది వెయ్యిసార్లు తిట్టుకున్నాడు ఇహ చివరికి ఆఖరి ప్రయత్నంగా టీ టీ ఇ దగ్గరికెళ్ళి బతిమాలాడు లేవండి లేవండి అదే సమాధానం అందర్కి ఎందుకు లేవు ఇస్తావా? చస్తావా? అనే ధైర్యం ప్రజలకి లేదు రాదు కళ్ళంబడి నీళ్ళు తిరిగినయి రాజారావుకి

నిస్త్రాణగా అనిపించి కాస్త కాపి అయినా తాగుదామని కాంటీన్ వైపు నడిచాడు కాపి రూపాయి కడుగు నీళ్ళ కాపి రూపాయ్ అతని మనసు బాదగా మూలిగింది అయినా తాగాడు కొదిగా ప్రాణం కుదుటపడ ది సగరెట్ తీస వెలిగించాడు లేటుగా వెళ్ళి ఆఫసులో ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు ఆఁ ఏదో చెప్పొచ్చు అలా అనుకున్న తరవాత అతను హాయిగా ఊపిరి ఎల్చాడు

ఇంతలో వెనుకనుంచి ఏదో చల్లని పదార్థం తనని తాకినట్లనిపించింది ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు చింపిరి జుట్టు కుర్రాడు అతనికి బలే నవ్వొచ్చింది ఏరా అందగాడా మళ్ళీ వచ్చావ్? అన్నాడు

ఒరేయ్ నాయనా! బాబూ! ఆ మిలిట్రీ వాళ్ళు నన్ను బయటికి తోసేసారు మళ్ళీ మనకి సటు ఎక్కడ దొరుకుతుందిరా? అన్నాడు రాజారావు

ఏటి? ఎటది? ఆరో నంబరు ప్లాట్‌పాం మాంకాళిగాడు సటు చెప్పాక దాన్నెవరూ మార్చడానికి ఈల్లేదు! లేదంతే! రైట్ రైట్ అని పరుగు పెట్టడం మొదలెట్టాడు

ఒలెంఎక్స్‌కి వెళితే వీడికి మినిమం తర్డ్ ప్రైజ్ గారంటీ అనుకున్నాడు రాజారావు బండి కూత పెట్టింది వాడు ఎరిగెట్టే ఇంజను వెనక పెట్లో ఎక్కాడు రాజారావుకి వెళ్ళేసరికి అక్కడ సటు కార్నర్‌లో రెడీగా ఉం కిటికీ పక్కన! హుర్రే అనుకున్నాడు

చూత్తారేంటి? కూకోండి అని వాడు గబ గబా బండి దిగిపోయాడు ఒరేయ్ ఒరేయ్ అని అరిచాడు బండ్లో వాళ్ళందరూ అతన్ని ఆశ్చర్యంగా చూసారు




అందగాడేటండీ మీ కోసం టేషనంతా ఎతికెతికి సచ్చిన తాత లవపడ్డారు అన్నాడు వాడు మొహం నిండా చమట దారగా కారుతోంది

ఎందుకూ డబ్బులిచ్చాగా ! అన్నాడు రాజారావు

డబ్బులిత్తే అయిపోతాదేటి? ఆ గౌరేసుగాడు రాంగినపరమేసనిచ్చాడు

సరే ఇప్పుడేవంటావ్ ? అన్నాడు

ఎతంతాను ఒచ్చి బండ్లో కూకోమంటాను ?

బండి మన బాబుగారి ముల్లట్రా? అన్నాడు పోయిన సటు ఎలానూ పోయింది వీడితో కాసేపు సరదాగా మాట్లాడుదామనుకున్నాడు నీ పేరేంట్రా? అన్నాడు

ఊసులాడాని కిదేవన్నా సంబరవాఁ? సంతా ? పదండి బేగి బండెల్లిపోగల్దు అన్నాడు వాడు

నువ్వు చెప్పేది నిజమే! నిజంగా సటుందా?

ఏం సార్ వాడేమన్నా డబ్బు లివ్వాలా? జేబు కొట్టాడా ? అని రకరకాల ప్రశ్నలు వేసారు

లేదు లేదు చాలా బాదగా అన్నాడు

మరేవిఁటండీ బాబూ? అన్నాడు ఒకతను

అందరూ వాణ్ణి గురించి అలా మాట్లాడినందుకు అతనికి గుండెల్లో ముల్లు గుచ్చినట్టుంది ఎంత నిజాయితీ ! ఈ లోపల చింపిరి కుర్రాడు తిరిగి వచ్చాడు

అయినా ఈ లేబర్ వెదవల్తో పెట్టుకోకూడదండీ మరి దరిద్రంగా బిహేవ్ చేస్తారు అన్న మనిష వైపు చాలా తీవ్రంగా చూసాడు రాజారావు అతను కొద్దిగా ఖంగారు పడ్డాడు తనన్నదాంట్లో అంత తప్పు ఏమిటో అతనికి అర్థం కాలేదు

చూడండి కొంచెం నే చెప్పేది వినండి! అన్నాడు రాజారావు అవతల మనిష వింటున్నాడా లేదా అని

# ఇ'వేమన' పద్యాలు



పుడమిలోన నరులు పుత్రు లబడగోరి
అడలుచుందురు వింత యాశచేత
కొడుకు గలిగినంత కులముద్ధరించునా
విశ్వదాబిరామ వినురవేమ

కూడా ఊడసంతా యుఎంటాఉ

తెబరు వెదవలు' అన్నారు నేనాఒకపోతే ఇంకా చాలా అనుండేవారు మిరన్నదానికి కల్చర్ వెదవలు అని వాడు తిట్టలేదు వాడికి చదువురాదు కాబట్టి కనీసం మిరు వాడికి నాకు మద్య యేం జరిగిందో కనుక్కునే ప్రయత్నం చెయ్యలేదు సరాసరి వాడు డబ్బు లెగొట్టాడా జేబు కొట్టాడా అన్నారు వాడి నుంచి వాడిలాంటి కొందరి దగిర్నుంచి మి కలాంటి **అనుబవం ఎదురయి ఉండొచ్చు కానీ అక్కడకూడా** నీతికీ నిజాయితీకి చోటు వుంది వాడి ఎతుకు **తెరువులో పైకి కొదిగా అవినీతి కనబడొచ్చు కాని** లోపల మహత్తరమైన సామాజిక న్యాయం ఉంది అని జరిగింది చెప్పాడు అవతల వ్యక్తి తెల్ల మొహం వేసాడు రాజారావు వాణ్ణి దగరకు ఎల్చాడు వచ్చాడు జేబులోంచి 10 రూపాయల నోటు తీసచ్చాడు

## దేశం మరి పాడవలేదు !

ఇదేటండి అన్నాడు వాడు

చూడు బాబూ నీలో నిజాయితీక వెల కడితే నా దృష్టిలో ఈ ప్రపంచం అంతా నీ కప్పచెప్పినా సరిపోదు ప్రస్తుతానికిదుంచు అన్నాడు

వాడు కొంచెం విచిత్రంగా చూసాడు రాజారావు అన్నది వాడి కరం కాలేదు కాని డబ్బులు తీసుకున్నాడు యెల్లొత్తానండి అని వెళుతున్న రైల్లోంచి కిందకు దూకేసాడు

ఆ రాత్రంతా రాజారావు వాణ్ణి గురించే ఆలోచిస్తూ గడిపాడు

పొదున్నే ఆఫసుకి వెళ్ళి జాయినింగ్ రిపోర్టు ఇచ్చాడు ఆ ఊళ్ళొ తన కెవరూ తెలియదు ఆఫసులో కొందరు పలకరించారు ముందు హోటల్లో రూమ్ తీసుకుని బొంచేస పదుకున్నాడు బాగా నిద్ర పట్టేసింది

షికారుగా బయటికి ఊరు చూదామని ఎయలేరాడు అటూ ఇటూ తిరిగి ఇంటి కొచ్చి పడుకుని ఆలోచించసాగాడు వాడే కళ్ళలో మెదుల్తున్నాడు ఎప్పుడు నిద్ర పట్టేసిందో నిద్ర పట్టేసింది పొదున్నే లేచి మామూలుగా ఆఫసు కెళ్ళాడు ఆఫసు మూసేస ఉంది దర్వాన్ చెప్పాడు సార్ మికు తెలియదా" మన ప్రదానమంత్రిగార్ని ఎవురో కాల్చి సంపేసారు అని

ఖిన్నుడైపోయాడు రాజారావు ఊరంతా గగ్గోలుగా ఉంది కొంతమంది గుంపులుగా కూడి బస్సుల్ని లారిల్ని అటకాయిస్తున్నారు షాపులు మిదపడి అన్నిటిని ధ్వంసం చేస్తున్నారు ఎందుకు ఎందుకు ఎందుకు ఒకటే ప్రశ్న ఆవిడ మరణం అందరికి బాదాకరమే బాదకి పర్యవసానం కన్నిరే గాని కరాళ నృత్యం కాదు గదా వాళ్ళల్లో పిల్లలు యువకులు వృద్ధులు కూడా ఉన్నారు అందరికి ఒకటే ఈ గలబాలో ఎదో ఒక ప్రయోజనం పొందుదామని ఎంత అవినీతి ఎంత నేర ప్రవృత్తి

రెండు రోజుల్నించి దొరకని సమాదానం ఒక్కసారిగా **దొరికింది అతనికి వాడికీ** (చింపిరి కుర్రాడికీ) మిగతా ప్రపంచానికి **తేడా** స్పష్టంగా కనిపించింది జాతి మొత్తం యేడ్వవలసిన తరుణంలో ఒక మహా వ్యక్తి మరణాన్ని తమ స్వప్రయోజనార్థం ఉపయోగించుకుంటున్న చీడ పురుగుల్ని కళ్ళారా చూసం తర్వాత వాడి తాలూకు నిజాయితీకి ఉన్న విలువ అర౦ అయ్యింది ఈ దేశం మొత్తం నీచత్వానికి లోబడిపోయినా వాడిలాంటి తులసి మొక్కలు కొన్ని మళ్ళీ జాతిని పునరుజ్జీవింప చేస్తాయి అన్న ఆశ అతనికి కొత్త స్పూర్తినిచ్చింది పోలీసు లొచ్చారు గుంపుల్ని చెదర గొట్టారు కర్ఫ్యూ విదించబడింది మొత్తం బ్లాక్ అవుట్ మంచి నీళ్ళు గాలి తప్ప ఎది దొరకటం లేదు యెంత కర్ఫ్యూ అయినా కొంత మంది పెద పొటెల పాయంతో హోటలు తెరిచి బోజనం పెడుతున్నారు కొంచరు అతి కృతజ్ఞులయి బొంచేస్తున్నారు రాజారావులాంటి వాళ్ళు బొంచెయి లేదు యెందుకంటే ఆ బోజనం ఖరీదు 35 రూపాయలు **కళ్ళు తిరిగినయ్ అక్కడికి** రాజారావు హోటలు యజమాన్ని అడిగాడు ఎమిటి దారుణం అని దానికి హోటలు ప్రొప్రైటరు చిద్విలాసంగా నవ్వి చూడు బాబు! నువ్వీ ఊరి క్కొత్తనుకుంటాను అన్నాడు

రాజారావు మాట్లాడలేదు తిరిగి అతనే మొదలెట్టాడు చూడు బాబు ఈ బోజనం డబ్బులు నేను తినెయ్యడం లేదు ఇందులో పెద్ద వాళ్ళందరికి వాటా వుంది వాళ్ళ అండతో మనం బోజనం పెడుతున్నాము మరాళ్ళకి వాటా ఉండొద్దా? అన్ని అందరికి ఇచ్చాకా నాకు ఎమిటి మిగులుద్ది? అన్నాడు సగరెట్టు పెట్టి కొందామని కొద్దిగా తెరుచున్న కొట్టు దగ్గర కెళ్ళాడు చార్మినార్ అడిగాడు ఐదు రూపాయ లన్నాడు కొట్టువాడు మళ్ళీ చింపిరి జుట్టు కుర్రాడు గుర్తొచ్చాడు □

## రాఘవేంద్రరావు, కృష్ణంరాజు సమ్మేళనంలో మరో బ్రహ్మన్నలాంటి భారీ చిత్రం విజయ మాధవీ వారి "రావణ బ్రహ్మ"

అరున్నర అడుగుల అందమైన విగ్రహం కృష్ణంరాజు. గంభీరమైన నటన ఆయన సొత్తు! సన్నివేశాలను పండించడంలో, పాటలను చిత్రీకరించడంలో, చెప్పదలచుకున్నది గుండెలకు గుచ్చుకునేలా సూటిగా చెప్పడంలో అందివేసిన సినీ మేధావి డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు. వీరి కాంబినేషన్‌లో విజయ మాధవి పిక్చర్స్ నిర్మించే "రావణబ్రహ్మ" చిత్రం సెప్టెంబర్ 21న సెట్స్‌కు వెళ్తుంది. జయసుధ, సత్యనారాయణ, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, అల్లు రామలింగయ్య, మాడా, అన్నపూర్ణ, సూర్యకాంతం, మమత, ఓ తమాషా పాత్రలో స్మిత, ద్విపాత్రలు నిర్వహించే కృష్ణంరాజు సరసన నాయికగా మరో మేటి నటి నటిస్తారని నిర్మాత వడ్డే రమేష్ తెలియజేశారు. పరుచూరి సోదరులు, వేటూరి, జె. వి. రాఘవులు, కె. ఎస్. ప్రకాష్, సతీం, వి. ఎస్. రెడ్డి, వర్మ, జి. జి. కృష్ణారావు ప్రభృత సాంకేతిక వర్గంతో వడ్డే శోభనాద్రి సమర్పించే ఈ మహత్తరమైన చిత్రానికి వడ్డే కిశోర్ నిర్మాణ సారథి.

## రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అనాదిగా ఆడది" షూటింగ్ ప్రారంభం

"మహిళల సమస్యలకు, ముఖ్యంగా వరకట్న సమస్యకు సరికొత్త కోణంలో పరిష్కార మార్గం చూపే బహుశా ఆవాజ్ హిందీ చిత్రం బహుళ ప్రజాదరణతో పాటు నాలుగు అవార్డులను కూడా దక్కించుకుంది. దాని ఆధారంగా ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నాం" అన్నారు అనాదిగా ఆడది చిత్ర నిర్మాత ఎస్. రామలింగేశ్వరరావు. దీనికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే అనిల్‌కుమార్ తనకో ఎక్స్‌కావాలో ఆది వచ్చేదాకా ప్రేక్షకులకు ఏం కావాలో దాన్ని సెల్యులాయిడ్ మీద రాబట్టుకునేదాకా కృషి చేసే అనుభవజ్ఞుడు. ఆగస్టు 26న ప్రారంభమైన తొలి షెడ్యూల్ సెప్టెంబర్ 20 వరకు జరుగుతుంది. బి. సుబ్రహ్మణ్య రాజేంద్రప్రసాద్ అశ్విని నూతన్‌ప్రసాద్ గొల్లపూడి దేవదాసు కనకాల సాక్షి రంగారావు చిట్టిబాబు జయవిజయ జయమాలిని బేబీ సీతతో పాటు ప్రత్యేక తరహా పాత్రలలో చంద్రమోహన్ ప్రభ కనిపిస్తారు. మాటలు ఎం. భాషణలకర్త సత్యం. స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. శరత్ ఛాయ రామచంద్రసింగ్ శిల్పం నాగేశ్వరరావు సత్యం కూర్పు వి. బుల్లిసుబ్బారావు నిర్వహణ నాగేశ్వరరావు సహకార దర్శకత్వం ఎం. హనుమంతరావు ప్రొడక్షన్‌తో ఈ చిత్రాన్ని మర్పి చేస్తున్న దగ్గ దేవీప్రసాద్ అక్టోబర్ 11 నుంచి 20 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో మొదటి కాపీ సిద్ధమవుతుంది అన్నారు.



ఎట్నుంచి ఎల్లా—ఎత్తైటూరి చిన్నోడు లో సుహాసిని కె ఆర్ విజయ



# కొత్త లిరిల్
# ఇది తాజాదనపు సరికొత్త అనుభూతి!

లిరిల్ కొత్తదిగా మారింది!
నిలిచి గుబాళించే కొత్త సువాసనతో...
ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో!




కొత్త
**లిరిల్**
తాజాదనపు సబ్బు

మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

కల్యాణ్ చక్రవర్తి, రజని, "మేనమామ"లో

## కె. రాఘవ చిత్రానికి వరప్రసాదరావు దర్శకత్వం

"పిశాచక్రవర్తి సమకూర్చిన అద్భుతమైన కథ. సెప్టెంబర్ 25 నుంచి షూటింగ్," అన్నారు ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అధినేత కె. రాఘవ. ఈయన నిర్మించే చిత్రానికి రచయిత మహారథి కుమారుడు త్రిపురనేని వరప్రసాదరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు.

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ సమర్పణలో తాజుద్దీన్-క్రౌన్ క్రియేషన్స్ నిర్మించే "పెళ్ళిళ్ళోయ్ పెళ్ళిళ్ళు" హాస్యప్రధాన చిత్రం షూటింగ్ పూర్తయింది. నరేష్, పూర్ణిమ, సంగీత, గొల్లపూడి మారుతిరావులతో పాటు భాగ్యనగర్ కళాకారులు పాల్గొన్నారు. ఆలీరాజా కథకు జిడిగుంట రామచంద్రమూర్తి సంభాషణలు రాయగా ఆదివిష్ణు పర్యవేక్షణ గావించారు. సి. నారాయణరెడ్డి, కోపల్లె శివరాం,

జయమాలిని, "పాపి కొండలు" లో



వడ్డేపల్లి కృష్ణ గీతాలకు బి. శంకర్ బాణీలు కూర్చారు. నాగరాజ్ ఛాయ, కృష్ణమూర్తి శిల్పం, లక్ష్మీనారాయణ ప్రొడక్షన్, మోహన్ కూర్పుతో గోపాలకృష్ణ దర్శకుడు.

## బాలకృష్ణ, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో రావుగోపాలరావు సమర్పించే చిత్రం

"ఇదొక టిపికల్ సబ్జెక్ట్. పరుచూరి బ్రదర్స్ ప్రతిభకు మరో నిదర్శనం," అన్నారు ఎస్. జయరామారావు. ఈయన జి. బి. క్రియేషన్స్ పతాకంలో నిర్మించే చిత్రంలో బాలకృష్ణ, రావు గోపాలరావు ప్రభృతులు పాల్గొంటారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, నందమూరి మోహన్ కృష్ణ ఛాయ, రవి కూర్పుతో ఎ. కోదండరామి రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.




# అడవిదొంగ

దర్శకత్వం
**కె రాఘవేంద్రరావు B.A**

నిర్మాత
**చలసాని గోపి**

సంగీత చక్రవర్తి కథ మాటలు పరుచూరి బ్రదర్స్ కెమెరా కె యస్ ప్రకాష్ కళ భాస్కరరాజు

గణపతి పిక్చర్స్ ప్రొడక్షన్స్‌వారి తొలి చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ

## శోభన్‌బాబు, బి.వి. ప్రసాద్‌లతో కొడాలి బోసుబాబు చిత్రం

"అన్నా చెల్లెళ్ళ అనురాగానికి, ఆప్యాయతకు అపురూపమైన రూపకల్పన. ఆగస్టు 12 నుంచి 18 వరకు మద్రాసు నుంగంబాక్కంలో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించాం. నవంబర్‌లో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. అక్టోబర్‌లో ఊటీలో నాలుగు పాటలను, మదుమలై అడవుల్లో పతాక సన్నివేశాలను పిక్చరైజ్ చేస్తాం. డిసెంబర్ విడుదల," అన్నారు బి. వి. ప్రసాద్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వ్యక్తిగా ఒక డిగ్నిటీ, నటుడిగా ఓ డిగ్నిటీ సదా పదిలపరచుకుంటూ తన జీవితానికి ఓ విశిష్టత సంపాదించుకున్న శోభన్‌బాబు నాయకుడుగా కొడాలి బోసుబాబు నిర్మించే తారకేశ్వరి మూవీస్ తొలి చిత్రంలో జయసుధ, సుమలత, శరత్‌బాబు, నూతన్ ప్రసాద్, పద్మనాభం, మిక్కిలినేని, మాడా, జయశీల ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. సత్యం సంగీతం, చెంగయ్య ఛాయ, దిలీప్‌సింగ్ …త్వం. జయచంద్రా రెడ్డి నిర్వహణ, బి. రామ్‌కుమార్ సహదర్శకత్వంతో అశోక్‌కుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

"దయ్యాల మేడ"లో అనూరాధ



## అనిల్‌కుమార్ దర్శకత్వంలో అర్జున్, విజయశాంతి

"మా డెరెక్టర్ ఒక రసవత్తరమైన కథను సమకూర్చారు. ఆ సబ్జెక్ట్‌ను సినిమాస్కోప్‌లో తీస్తేనే బావుంటుందనిపించింది. అంచేత, ఎక్కువ వ్యయమైనా వెనుకాడక జనవరిలో షూటింగ్ మొదలెడుతున్నాం. ఎక్కువ భాగం ఊటీలోనే షూటింగ్ జరుగుతుంది. అర్జున్, విజయశాంతితో పాటు శరత్‌బాబు ఒక కీలకమైన పాత్రను ధరిస్తారు," అన్నారు జి. వి. ఆర్. ప్రొడక్షన్స్ అధినేతల్లో ఒకరైన గాలి వెంకట్రావు. ఈయన జి. వి. ఆర్. క్రియేషన్స్ బానర్‌లో నిర్మించే ఈ సినిమాస్కోప్ చిత్రానికి సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, శరత్ ఛాయతో అనిల్‌కుమార్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

గంగాధర్

వై.హరికృష్ణ
సమర్పించు

కృష్ణచిత్ర
(హైదరాబాద్)

SREE PUBS

# వందేమాతరం

దర్శకత్వం: కృష్ణ

సంగీతం చక్రవర్తి ఫోటోగ్రఫీ ఆర్ రామారావు

నిర్మాత. వై అనిల్‌బాబు

సీడెడ్ · వి.యం.సి



# తమిళ సినిమా విశేషాలు

● తామర కుళం" (కలువ కోనేరు) అనే చిత్రం 27 రోజుల్లో తయారైంది. "సిర్పై" (శిక్ష) చిత్రపు యూనిట్టే ఈ చిత్రానికి పనిచేసింది. ఈ చిత్రంలో 200 అడుగులున్న షాట్‌లో లక్ష్మి పాల్గొంది, దానిని ఒకే టేక్‌లో ఓ-కే చేశాడు డైరెక్టర్ శక్తి.

● అమితాబ్‌బచ్‌చన్, సునీల్‌దత్‌లకుమల్లే రాజకీయరంగంలో ప్రవేశించిన మరో తమిళనటుడున్నాడు. ఈయన పేరు అన్నతంబి. ఎం. పి. ఈయన ఎ ఐ డి ఎం కె పార్టీ సభ్యుడు. 1977లో తమిళనాడు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో పోటీ చేసి, వెయ్యి వోట్ల తేడాతో వోడిపోయాడు. ఆ తర్వాత లోకసభ ఎన్నికలలో దాదాపు లక్ష ఓట్ల మెజారిటీతో గెలుపొందాడు. ఈ హాస్య నటుడు పలు తమిళ, మలయాళ చిత్రాలలో నటించాడు.

● నళిని అసలు పేరు రాణి. ఈమె సోదరుడు 'రాణీ ఎంటర్‌ప్రైసెస్' పతాకంలో "శివప్పు కిళి" (ఎర్ర చిలుక) అనే చిత్రాన్ని నిర్మిస్తున్నాడు.

● మాధవి "జై భేతాళ్" తెలుగు తమిళ 3-డి చిత్రానికి వరుసగా 60 రోజుల పాటు కాల్‌షీట్ ఇచ్చింది.

● కె. బాలచందర్ తొలుదొల్త నిర్మిస్తున్న మలయాళ చిత్రానికి ఐ. వి. శశి దర్శకుడు.

● నటి శ్రీప్రియ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో హిందీ "జవాబ్" చిత్రం తమిళంలో తయారవుతోంది.

● "సూపర్‌బాయ్" 3-డి చిత్రంలో పాల్గొనడానికి బొంబాయినుంచి మద్రాసు వచ్చిన నర్తకి లీనాదాస్‌కు టాజ్‌కోరమాండల్ హోటల్లో బస ఏర్పాటు చేయబడింది. అందుకయిన బిల్లు రూ. 15,500.

● ప్రముఖ దర్శకుడు స్వర్గీయ పుట్టణ్ణ కణగాల్ ఒకే ఒక చిత్రంలో నటించాడు. దర్శక రచయిత గుహనాథన్ కోర్కె మేరకు "ఒళిమయమాన ఎదిర్ కాలం" అనే తమిళ చిత్రంలో పాల్గొన్నాడు. కొంత షూటింగ్ జరిగాక రషెస్ చూసిన పుట్టణ్ణ "నా ఆక్టింగ్ పరమ ఛండాలంగా ఉంది. దయచేసి, వేరే టేలెంటెడ్ ఆక్టర్ ఎవరితోనైనా మళ్ళీ రీ షూట్ చేయండి," అని విన్నవించుకున్నాడట. ఆ పాత్రను చివరికి అశోకన్ ధరించాడు.

● శివాజీ తన కొడుకు ప్రభుతో కలిసి నటించిన చిత్రాలు కొన్ని ఫ్లాప్ అయ్యాయి. అంచేత, తనతో పాటు ప్రభుకు బదులు రజనీకాంత్‌ను బుక్ చేయమని సలహా ఇస్తున్నాడు శివాజీ. "ఖుర్బానీ" ఆధారంగా బాలాజీ, "ఇన్‌క్విలాబ్" ఆధారంగా వీరాస్వామి నిర్మించే తమిళ వెర్షన్‌లో శివాజీతో పాటు రజని నటిస్తున్నాడు. ఈ చిత్రాలకు అప్పుడే కోటి రూపాయలకు పైగా బిజినెస్ అయిపోయిందట.

● "మయూరి" చిత్రం తమిళంలోకి డబ్ చేయబడి విశేషంగా ప్రేక్షకులను ఆకర్షిస్తోంది. బెంగుళూరులో హౌస్‌ఫుల్ కలెక్షన్స్‌తో నడుస్తోంది. అక్కడ థియేటర్ ఎదురుగా ఉంచబడిన బ్రహ్మాండమైన సుధ కట్ ఔట్‌కు అభిమానులు ప్రతి రోజూ బ్రహ్మాండమైన రాక్షస పూలమాలలతో అలంకరిస్తున్నారట. సుధ ఇప్పుడు అయిదారు తమిళ చిత్రాలలో బుక్ అయింది.

● చాలా సంవత్సరాల క్రితం తయారైన "అశోక్‌కుమార్" చిత్రంలో కే. శే. ఎం. కె. త్యాగరాజ భాగవతార్, స్వర్గీయ కన్నాంబతో పాటు ఎం. జి. ఆర్. సేనాధిపతిగా ఒక చిన్న పాత్రను ధరించారు. ఇప్పుడా చిత్రం మళ్ళీ విడుదల చేయబడింది. అందులో కన్నాంబ, ఎం. జి. ఆర్‌తో "చెప్పిన పని చేసే చేవలేని నువ్వూ ఓ మగాడివేనా?" అనే డైలాగ్ తొలగించబడింది.

(జి. ఐ. జి.)



గుర్తుకొచ్చేవి నిజానికి ఇప్పుడామె గజ్జె కట్టి అబినయం చేస్తే వద్దనే వారెవరూ లేకపోవచ్చు కాని, ఆమెపై సమాజమిప్పుడు కుమారరాజా వారి భార్య అని ముద్ర వేసింది దాని నుండి ఆమె తప్పించుకోలేదు ఉన్మత్త స్థితిలో కూడా తాను మహారాణి అనీ కుమారరాజా వారి బార్య అనీ చెప్పుకునేది అన్నట్లు నీకు ఈ విషయం చెప్పటం మరిచానా నాయనా ఆమెకు కొంచెం మతిస్థిమితం కూడా తప్పింది అట్టి దశలో

చతురస్రా తధో ద్వృతా తదా తలముబేస్మ
స్వస్తికే విప్రకొర్ణే బాహ్యరాళ కాటకాముఖే
అవిత్థ వక్రే స్యూచాస్యో రేచితా వర్ధరేచితా
ఉత్తాన మతి తాచైవ పల్లహివ తదాకరే
అని తనలో తాను గదిలో గెంతుతూ ఉండేది

పారిజాతమ్మగారూ ఈ కథ చాలా హృదయవికారముగా ఉంది కానీ, నాదొక అనుమానము ఆమె నటించటం మానివేసినా ఒక చిన్న నాట్య పారశాలను ప్రారంభించి ఉంటే ఎలా ఉండేదంటారు?

నిజమే' కానీ, ఒక్క విషయం అనుభవంలో గుర్తించవలసి ఉంటుంది గొప్ప అభినేత్రి ఎప్పుడూ గొప్ప టీచర్ కాలేదు అందుకొక ప్రదానమైన కారణం ఉంది కళాకారిణికి తాను పేరు, ప్రఖ్యాతలు గడించాలని, విదేశాలు తిరిగి బోలెడు డబ్బు గడించాలనీ, ప్రేక్షకులంతా తనకు బ్రహ్మరదం పట్టాలని భావిస్తూ ఉంటుంది ఆమెలో సహజంగానే అహంకారం, అసూయ ఉంటాయి తనను మించిన నర్తకి ప్రపంచంలో ఎక్కడా ఉండకూడదని అనుకుంటుంది ఇది అద్యాపక ప్రవృత్తికి చాలా భిన్నమైనది ఉపాధ్యాయుడు ఎంత సేపూ తన శిష్యులు గొప్పవారు కావాలని వారు విద్యలో తనను మించిన వారు కావాలని కోరుకుంటాడు ఆ వుద్దేశ్యంతో నే మర్మం విడిచి తన శాస్త్ర రహస్యాలన్నీ కూడా శిష్యుడికి నేర్పిస్తాడు కాని, ప్రదర్శనలిచ్చే కళాకారుడు – అంటే మి బాషలో ఏమంటారు?"

"పెర్ఫార్మింగ్ ఆర్టిస్ట్

అదే, అదే - అతడు శాస్త్ర రహస్యాలు, నలుగురికి చెబితే తన వృత్తికి బంగం కలుగుతుందనీ, విద్యను రహస్యంగా దాచుకుంటాడు ఏమైతేనేం ఆనందవల్లి తాను నాట్య విద్యకు అధ్యాపకురాలు కాలేదు కాని తన కుమార్తె మాత్రం గొప్ప టీచర్, గొప్ప విశ్వవిఖ్యాత నర్తకి కావాలని ఆమె వాంఛించేది

భవభూతి అర్ధ నిమిలిత నేత్రుడై వింటున్నాడు

"అక్కగారూ' నాదో చిన్న సందేహం ఈనాడు మి స్వామివారి గుట్టమిద క్షీరసాగర మథనం ప్రదర్శిస్తున్న ప్రతిభ

'అవును నాయనా' నేనూ అలాగే విన్నాను ఈమెయే ఆనందవల్లి కూతురని --ఆ నోటా ఆ నోటా

పారిజాతమ్మ మౌనం వహించింది

ఆమె చెప్పిన ఆనందవల్లి కథకు తెరపడిపోయింది

గుట్టమిద ప్రతిభ నృత్యానికి తెరయెత్తారు

నట్టువాంగపు వాద్యసంగీత విశేషాలు మైకులో వినపడుతూ వున్నాయి

ప్రతిభ పైన నృత్యం చేస్తున్నది

భవభూతి మాత్రం కిందనే ఆనందవల్లి కథ చెప్పిన పారిజాతమ్మ పాదాల వద్దనే ఆ రాత్రి పొద్దు పోయేవరకు ఉండిపోయాడు

## -7

ప్రతిబతో బవభూతి ద్రాక్షారామం, అన్నవరం ప్రదర్శనలకు వెళ్ళి వచ్చినప్పటి నుంచి ఆమెకు అతడు బాగా సన్నిహితుడైనాడు ఇదివరకు వారిరువురు పరిచయస్థులు కాని ఇప్పుడామె భవభూతిని కేవలం ఒక పరిచితుడిగానో శ్రేయోభిలాషిగానో చూడటంలేదు అంతకంటె ఎక్కువగా బావిస్తున్నది

నృత్య రూపకానికి అభినయాన్ని కూర్చడంలో ఆమెతో పాటు భవభూతి ఆమె నాట్యాలయంలో నే ఒక్కొక్కప్పుడు ఉండిపోయేవాడు ఒక్కొక్క పదానికి, ఒక్కొక్క పాదానికి ఏ ముద్ర బాగుంటుందో, ఏ సాత్త్వికాబినయాన్ని ఎలా



ఒప్పిస్తే కుదురుతుందో ఇరువురు సుదీర్ఘంగా చర్చించుకొనే వాళ్ళు ఈ చర్చల్లో వీరితో పాటు సుధారాణి కూడా పాల్గొనేది బవభూతి ఒక విషయం గుర్తించాడు సుధారాణి కేవలం ప్రతిబకు సహాయకారిణి మాత్రమే కాదు ఆమెకు అన్నీ తానేయై సహాయం చేస్తున్నది వారిరువురి మధ్య వున్న అనుబంధం రక్త బంధువులకన్నా ఎక్కువైనదిగా బవభూతి గుర్తించాడు

ఒక్కొక్కప్పుడు చర్చల్లో మునిగిపోయి రాత్రి అక్కడే వారితో పాటే బోజనం చేసేవాడు ఆ తరువాత బస్సు దొరికితే ఇంటికి వెళ్ళిపోయేవాడు లేకుంటే అక్కడే పడుకునేవాడు

ఒకనాడు సుధారాణి నవ్వుతూ బవభూతిగారూ' మికెందుకు ఇంత శ్రమ నచ్చిన ఒక పిల్లను చూచి పెళ్ళి చేసుకుంటే పోయేది గదా' మికు హోటల్ తిండి

# ప్రతిభ

తినే బాధ తప్పిపోయేది అన్నది

'చూడండి సుధారాణీ! నేనసలే చపలచిత్తం వాడిని ఇల్లూ వాకిలీ నాకు పట్టవు రచన చేస్తున్నానూ అంటే నాలో అంతర్గతంగా దాగివున్న ఏవో ఉద్దేశాలనూ, ఆలోచనలనూ, ఆవేదనలనూ బహిర్గతం చేసుకోవడానికి వాహికగా శబ్దాలను ఉపయోగించుకుంటున్నాను అంతేకాని ఇది సమాజోద్ధరణ అనిగాని, తపస్సుగా గాని భావించటంలేదు అనవసరంగా ఇప్పుడు నా జీవితమే తెగిన గాలిపటంలా ఎగురుతున్నది "మరొకళ్ళ గొంతు కోయటమెందుకు? నేను తిన్న చోట పరుండను దమ్మిడీ రికాణాలేని వాణ్ని సంసారం నాకు బరువు నేను సంసారానికి బరువు' అన్నాడు బవభూతి

మీరలా అంటే ఎట్లా? మీతో పరిచయం లేక మునుపు మిమ్మల్ని గుర్తించలేకపోయాం కాని మీరు మహా కళాతపస్వి అని మాకు తెలిసిపోయింది ప్రతిభ మిమ్మల్ని పరోక్షంగా ఎంత పొగుడుతుందో ఆమెకు తెలుసు నాకు తెలుసు మీకేం తెలుసు?

బవభూతి చలించిపోయాడు

"మీ అబిమానానికి కృతజ్ఞుణ్ని అమె సామాన్య కళాకారిణి కాదు ఆమె ఒక దేవత ఏదో శాపవశాన దేవలోకం నుండి దిగివచ్చింది ఆమె ఉద్విగ్న నర్తకి పుస్తకాల్లోని ముద్రలు రసాలు, సాత్త్వక బావాలు కొందరు శరీరంమీద యాంత్రికంగా ప్రదర్శిస్తారు మరికొందరికి అవి చర్మపు లోలోతులకు దిగుతాయి ఇంకొందరు వాటిని మనోగతం చేసుకుంటారు ఆయా స్థాయిల్లో లోతుల ననుసరించి ఆ కళ వికసించి విజృంబిస్తుంది కాని ప్రతిభకు ఈ కళ ఆత్మగతమైనది ' అన్నాడు బవబూతి

'ఆమె కూడా అందరిలాగే శాస్త్రం చదువుకున్నది కాని శాస్త్ర పాండిత్యం వున్న వాళ్ళందరూ కళాకారులు కారు దానిని మించిన ప్రతిభ దివ్యదత్తమైన వరం అది వున్నవారే విశ్వవిఖ్యాతి నార్జిస్తారు మీరన్నట్టు ఆమె నాట్యం చేస్తున్నప్పుడు తనను తాను మరిచిపోతుంది

"ఆమెకది జన్మసిద్ధమైన లక్షణం కావచ్చు అన్నాడు భవభూతి ఇలా అనడంలో అతని మనసులో ఆనందం స్పురించింది కాని సుదారాణీ ఆ మాటను చాలా సామాన్యార్ధంలోనే స్వీకరించింది బవబూతికి మాత్రం ఒక్క విషయం మాత్రం అర్ధమైంది ప్రతిభ తనను విపరీతంగా అభిమానిస్తున్నది ఒక రచయితగా కాదు - అంతకంటే ఎక్కువగా

సుధారాణీ మాటలు ఈ విషయాన్ని నిర్ధారించాయి

ప్రతిభ గత జీవితాన్ని గూర్చి భవభూతికి కొన్ని ప్రశ్నలున్నాయి పూలదండలతో, సన్మానాలతో నిరంతరం ముంచెత్తబడే ప్రతిభ ముఖంలో ఎక్కడో ఒక విషాద రేఖ లీలగా గోచరిస్తున్నది అందుకు కారణమేమిటి? ఈ విషయం సుధారాణిని అడుగుదామనుకున్నాడు

కాని దానిని ఆమె అనవసర ప్రసంగంగా భావిస్తే తాను గౌరవం పోగొట్టుకొన్నట్టవుతుంది అందుకని వూరుకున్నాడు

నిజానికి సుధారాణికి కూడా తానంటే విపరీతమైన అభిమానం తాను వాళ్ళింటికి వెళ్ళినప్పుడు కేవలం ఒక స్నేహితుడికో, పరిచయస్థుడికో గాక అంతకంటే మిన్నగా పరిచర్యలు చేస్తున్నది

ఈ అనుబవాలతనిని ముగ్ధుణ్ని చేశాయి. వారికి తనను ఎక్కువగా సన్నిహితం చేశాయి

భవభూతి మనసులో ఇప్పుడెందుకనో ఒక కోరిక బయలుదేరింది అది ప్రతిబ గత జీవితాన్ని గూర్చి తెలుసుకోవాలనే వాంఛ.

ముఖ్యంగా పారిజాతమ్మ కథ చెప్పిన తర్వాత - ఆనందవల్లికి ప్రతిభకూ, సంస్కారగతంగానూ, ఆవేశాల్లో కూడా చాలా సన్నిహిత సంబంధం వున్నట్టు వ్యక్తమయింది

ఒకనాడు రవీంద్రభారతిలో ఒక నృత్యప్రదర్శన జరిగింది. దానిని చూచే నిమిత్తం బవభూతి, ప్రతిభ, సుధారాణీ మరికొందరు మిత్రులు కలిసి వెళ్ళారు

ఆండాళ్ కూడా వచ్చింది

అమెను చూచి భవబూతి నమస్కరించాడు

'ఇటీవల తమరు కనపడటంలేదు?' అని మాట వరసకు పలకరించాడు

ఔనౌను మరి బిజీగా వున్నాను అయినా మన వాత్సాయనశర్మ ఇపుడు తన కాళ్ళమీద తాను నిలబడ్డాడు కవుల కాలేజీ ఒక దోవకొచ్చింది అయన శిష్యులు వివిధ రంగాల్లో బాగా మార్కెటింగ్ చేసుకుంటున్నారు. మీకు తీరుబాటున్నప్పు డొకసారి మా ఇంటికి రండి కొన్ని విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను" అన్నది

ఆమె ఏదో ప్రత్యేకమైన విషయం చెప్పాలనుకుంటున్నదని భవభూతి గ్రహించాడు

అలాగే" అని అప్పటికి ఊరుకున్నాడు.

ఆండాళ్ కోరిక ననుసరించి భవభూతి ఒకనాడు బంజారాహిల్స్‌కు వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి అచట ఒక విచిత్రం జరుగుతున్నది. లోపలనుండి పెద్దగా ఆండాళ్ మాటలు వినపడుతున్నాయ్. ఎవరితోనో ఆమె ఘర్షణ పడుతున్నట్లుంది. ఇటువంటి పరిస్థితుల్లో లోనికి వెడదామా వద్దా అనుకుంటూ ముందు వసారాలో కూచున్నాడు

రంగప్రవేశం చేయించినందుకు ప్రతివారి వద్దా నేను తులం బంగారం, పట్టుచీర, పదివేల రూపాయల నగదు పుచ్చుకుంటాను కాని మీ నాన్నగారు పెద్ద పలుకుబడి కలవాడనే కారణంతో మీ వద్ద నేను ఐదువేలకంటే ఎక్కువ








# పరిపూర్ణ వ్యక్తిత్వాన్నిచ్చే బట్టలు



# ప్రతిభ

పుచ్చుకోలేదు ఎప్పుడైనా మన కళాకేంద్రాన్ని మీ నాన్నగారు ఆదరిస్తారని తన పలుకుబడి ఉపయోగించి మనకేమైనా చందాలిప్పిస్తాడని నేననుకునేదాన్ని కాని మొన్న ఆయన చేసినదేమిటి? లండన్ ఫోక్ డాన్స్ ఫెస్టివల్‌లో మన కేంద్రానికి చాన్స్ రాకుండా చేశారు ఎన్నాళ్ళ నుంచో మన కళను అక్కడ ప్రదర్శించి వారి చేత నటరాజస్వామికి శృంగార నీరాజనం పట్టించాలనే నా కోరిక వ్యర్థమైపోయింది "

"క్షమించండి అది మా నాన్నగారి చేతిలో కూడా లేకపోయిందిట. కేంద్రం నుండి ఏవో కొన్ని వత్తిడులు ఒచ్చాయట లోపలినుండే మరో స్త్రీ సన్నని కంఠస్వరం

"చూడమ్మా! అభిమానమంటూ ఉండాలే కాని ఏ వత్తిడిలూ అడ్డం రావు మనమే వారిపై వత్తిడి తీసుకురావచ్చు నీమీద నేను పెట్టుకున్న ఆశలన్నీ కూడా వ్యర్థమైనాయి

అలా అనకండి టీచరుగారూ! అమెరికాలో జరగబోయే నృత్యోత్సవాలలో తప్పకుండా మనకే చాన్సు వచ్చేటట్టు చేస్తామని నాన్నగారు చెప్పమన్నారు

అది జరగని పని అమెరికా కోసం ప్రతిభ ఎప్పటి నుంచో త్రై చేసుకుంటున్నది ఈ హైదరాబాదులో మనమెక్కడ సుఖపడి పోతున్నామోనన్న దుగ్ధతో బెంగుళూరు నుండి ఆవిడ ఒకతె వచ్చి మన నెత్తిన తాండవమాడుతున్నది. ఈమె ఇలా ఊడిపడుతుందని నేను ముందే కొంచెం వూహించి వుంటే ఈమె బేగంపేట ఎయిర్‌పోర్ట్‌లో కాలు పెట్టకుండానే చేసేదాన్ని టాలెంటూ లేదు పాడూ లేదు - వెధవ అసూయ ఈవిడ "

అవును టీచరుగారూ!"

బయట నుంచి ఇవన్ని వింటున్న భవభూతి నవ్వుకున్నాడు నిజంగా ఎవరు అసూయాపరులో చూస్తేనే తెలుస్తున్నది ముంజేతి కంకణానికి అద్దాలెందుకు

కళారంగం ఒక తపో కేంద్రం కాదని సిద్ధేంద్రయోగి లాంటి తపస్వులు, ఋషులు ఈనాడు లేరని, లండన్ పర్యటనకు, అమెరికా యాత్రలకు, తులమెత్తు బంగారానికి, పట్టు చీరలకు ఇదొక విపణి వీధి అని గ్రహించటానికి భవభూతికి ఎక్కువసేపు పట్టలేదు నిశ్శబ్దంగా భవభూతి **గేటు తలుపు తీసుకుని బయటకు నడిచాడు. అండాళ్ మాట్లాడిన మాటలు భవభూతి విన్నాడనే విషయం అండాళ్‌కు తెలియడం బవభూతికి ఇష్టంలేదు**

అలా వెళ్ళి సమీపంలోని రామమందిరంలో కూర్చున్నాడు అది నిర్జనంగా వుంది కొంచెంసేపు అక్కడ ఆయన భావసమాధిలో గడిపాడు

పాశ్చాత్య దేశాల వాళ్ళకు భారతీయ కళ అంటే ఏమిటో తెలియదు భారతదేశంలో కూడా కళయొక్క ప్రయోజనం క్రమంగా కళాకారులు మరచిపోతున్నారు

ఇక సామాన్యునికి ఎలా తెలుస్తుంది?

రాఘవేంద్రా! తప్పకుండా అమెరికాకు ప్రతిభకే అవకాశం వచ్చేటట్టు చూడు ఈ అండాళ్ వంటి వ్యాపార కళాకారిణులు అక్కడకు వెళ్ళి డాలర్ల కోసం కళనమ్మి కళంకం తీసుకు రాకుండా చూడు ఇది ఇపుడు నావంటి సామాన్యుని చేతుల్లో లేదు నీవే చేయాలి అన్నాడు భవభూతి.

ఇంతలో కే వెనక ఎవ్వరో నవ్వినట్టు అనిపించింది

వెనుదిరిగి చూచాడు ఆలయంలో పలికి ప్రతిభ వస్తున్నది.

భవభూతి నివ్వెరపోయాడు!

ఇదేమిటి– ప్రతిభ అండాళ్‌ను కలుసుకోవడానికి వచ్చిందా లేక– ఎవరినైనా పెద్దలను కలుసుకోవడానికి వస్తూ మార్గ మధ్యంలో ఆలయంలోకి వచ్చిందా?

'ప్రతిభా!"

"ఏమిటిలా మీలో మీరే ఏకాంతంగా కూచుని మాట్లాడుకుంటున్నారు?" ప్రతిభ నవ్వింది.

"ఏమీలేదు. మీ గురించే రామచంద్రుణ్ణి ఒక కోరిక కోరుకుంటున్నాను."

"ఏమిటది?"

"మరేం లేదు. మీరు తప్పకుండా అమెరికాకు వెళ్ళాలని. అక్కడ మన భారతీయ కళా సౌందర్యాన్ని చక్కగా ప్రదర్శించి మన ఆధ్యాత్మిక విలువలను చాటే అవకాశం లభించాలని, అందుకు స్వామి తోడ్పడాలని కోరుకుంటున్నాను '

ప్రతిభ నవ్వింది

"మరి అంత పెద్ద పెద్ద మాటలనకండి అందరిలాగే నేనూ ప్రదర్శనలకు వెలగట్టి ధనం తీసుకుంటున్నదాన్ని నలుగురికంటె కొన్ని వేలు ఎక్కువే వసూలు చేస్తున్నాను గాని ఎవరికీ ఉదారంగా సేవ చేయడం లేదు "

"ఎందుకు లేదు ద్రాక్షారామంలో చాలా తక్కువ డబ్బుకే కార్యక్రమానికి ఒప్పుకున్నారు గదా!"

"అది వేరు అలాంటివి అప్పుడప్పుడు– ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే అలా జరుగుతుంది. మిగిలినప్పుడు నేనూ అందరి కళాకారిణుల లాంటి దాన్నే. నాలో ప్రత్యేకత ఏమి లేదు "

"ఎందుకు లేదు– మీలో ఉద్విగ్నత వుంది. మీలో తప్ప ఇంతవరకు ఎవరిలోనూ ఈ ఉద్విగ్నత కనపడలేదు కొంతకాలం క్రితం ద్రాక్షారామంలో ఆనందవల్లి అని ఒకావిడ ఉండేది ఆవిడ ఉద్విగ్న నర్తకి ఆ లక్షణాలే మీలోనూ కనిపిస్తున్నాయి" అని భవభూతి ప్రతిభ మనోభావాలను చదవడానికి ప్రయత్నించేందుకై ఆమె ముఖంలోకి చూస్తున్నాడు ఆమె మనోభావాలు ఆమె నేత్రాలలో ఎలా ప్రతిఫలిస్తాయో పరిశీలిస్తున్నాడు. కాని ప్రతిభలో ఎలాంటి భావమూ ద్యోతకం కాలేదు

ఈమె మహానటి– నర్తకి మనోగతమైన తన భావాలను ఆమె గుప్తంగా అణచుకోగలుగుతున్నదా?

లేక ఆమెకూ ఆనందవల్లికీ నిజంగా ఎలాంటి సంబంధమూ లేదా?

భవభూతి ఇదమిత్థంగా ఎలాంటి నిర్ణయానికి రాలేకపోయాడు ప్రతిభ తనకు చనువు ఇచ్చిన మాట నిజమే కాని ఇంతకన్నా ఎక్కువగా ప్రత్యక్షంగా ఆమె జన్మ రహస్యాన్ని గూర్చి తానామెను ప్రశ్నిస్తే ఆమె అపార్థం చేసుకుంటుందో ఏమో?– ఒకవేళ కోపం వచ్చినా రావచ్చు.

ప్రతిభ భవభూతికి సమీపంలో కూర్చున్నది.

"చూడండి ప్రతిభా! మీమీద నేనొక దైవీభావాన్ని పెంచుకున్నాను. దానిని నిలబెట్టుకోవాలంటే మీరు నా కోరికను నెరవేర్చమని అడగడానికి సాహసించలేక పోతున్నాను "

"ఫరవాలేదు. మీ మనసులోని మాట నిర్మొగమాటంగా చెప్పండి. నా దగ్గర సంశయాలెందుకు?"

"చెప్తాను కాని అది వినడానికి ముందు ఒక చిన్న కథ వినాలి "

"ఏమిటి?"

"వినండి పూర్వం అక్బరు పాదుషా కొలువులో తాన్‌సేన్ అనే గొప్ప సంగీత విద్వాంసుడుండేవాడని మనకందరకూ తెలుసు ఆయన పాదుషా వారి వద్ద నుండి ఎన్నో సన్మానాలందుకున్నాడు పాదుషా వారు సంగీత ప్రియులు అందులోనూ తాన్‌సేన్ సంగీతమంటే చెవి కోసుకునేవాడు ఇలా ఉండగా ఒకనాడొక విచిత్రం జరిగింది పాదుషా ఒంటరిగా మారువేషంలో నగరాన్ని సంచరిస్తూ వున్నారు. అలా వెళ్ళి వెళ్ళి ఊరికి వెలుపలవున్న ఒక తోట ప్రాంతానికి వెళ్ళాడు ఆ తోటలో ఒక ఆశ్రమం వుంది ఆ సమీపంలోనే ఒక హనుమంతుడి మందిరం వుంది ఆ మందిరంలో ఎవరో కూచుని గానం చేస్తున్నారు అది సంధ్యా సమయం సాధారణంగా కలకలారావాలు చేసే పక్షులు కూడా నిశ్శబ్దంగా వుండి ఆ మధురగానాన్ని విని పరవశిస్తున్నాయి

పాదుషా ఆ సంగీతానికి పులకరించి పోయాడు ఆ సంగీతం పాడుతున్నదెవరో తెలుసుకోదలిచాడు దగ్గరకి వెళ్ళి చూచాడు అక్కడ ఆంజనేయ స్వామి సన్నిధానంలో ఒక ముదుసలి కూచుని వున్నాడు

ఆయన చుట్టూ వాద్య విశేషాలు ఏమీలేవు కేవలం చేతిలో ఏకతార మాత్రమే వుంది. దాన్ని ఆధారం చేసుకుని ముసలివాడు తాదాత్మ్యం చెంది గానాలాపన చేస్తున్నాడు నిజానికి ఆ పాట వినడానికి అక్కడ శ్రోతలెవరూ లేరు ఎదురుగా హనుమంతుడి విగ్రహం మాత్రమే వుంది ఆ ముసలివాడు తనలో తాను పాడుకుంటున్నాడో లేక హనుమంతుడి విగ్రహానికి వినిపిస్తున్నాడో కూడా తెలియదు పాదుషా మనస్సు వసంతంలో చిగిర్చిన మామిడికొమ్మలా అయింది







ఆయన ఇంత గొప్ప సంగీతాన్ని ఎన్నడూ విని ఎరుగడు.

అంతఃపురానికి వెళ్ళిన వెంటనే భటులను పిల్చి ఆ ముసలి వాడెవరో తెలుసుకు రమ్మన్నాడు భటులు వెళ్ళి ఆ ముసలివాడి వివరాలు తీసుకు వచ్చారు

"ప్రభూ! ఆయన పేరు రామానందుడు ఆయన ఒక సన్యాసి ఆ ఆశ్రమం ఆయనదే ఉదయం నుండి రాత్రి వరకూ అలా హనుమంతుని సేవలో జీవితం గడుపుతుంటాడు సాయంత్రం పూట అలా పూజలో భాగంగా గొంతెత్తి గానం చేస్తుంటాడు." చెప్పారు భటులు

వెంటనే అక్బరు పాదుషా తన అమాత్యులలో ఒకణ్ని పిలిచి–

"రామానందుణ్ని రేపు ఉదయం దర్బారుకు పిలిపించండి అక్కడ కచేరి పెట్టిద్దాం'– అన్నాడు

మర్నాడు ఉదయం పాదుషా తన దర్బారులో రామానందుడి సంగీతం వినాలని ఉబలాట పడ్డాడు కాని తీరా చూస్తే రామానందుడు దర్బారుకు రాలేదు

అక్బరుకు కోపం వచ్చింది. "ఇదేమిటి రాత్రి నేచెప్పిన పని చేయలేదా?" అని మంత్రి వేపు చూచాడు

'వెళ్ళాను ప్రభూ' తమ ఆజ్ఞను రామానందుడికి నివేదించాము కాని ఆయన రాలేదు సరిగదా– నాకు మీ రాజస్థానాలతోనూ, ప్రభువుల

# ఆంతర్య శుద్ధి

"హృదయ శుద్ధిగలవారు ధన్యులు. వారు దేవుని చూచెదర"ని క్రీస్తు ప్రభువు పలికాడు. చిత్తశుద్ధి లేకుండా, ఆరాధనలు, ప్రార్థనలు, దానధర్మాలు చేసినట్లయితే అది కేవలం బాహ్యమైన ఆచారముగా పరిగ్రహింపబడుతుందేగాని, వీటివలన మానవుడు ఒక్క అడుగుకూడా ఆధ్యాత్మికముగా జీవితంలో పైకి సాగలేడు. దొంగతనానికి బయలుదేరకముందు ప్రతీదొంగా తన ఇష్టదైవాన్ని ప్రార్థించకుండా అడుగు ముందుకు వేయడు. నల్లబజారు వర్తకుడుకూడా తన నల్లధనముతో ధర్మాసుపత్రులు, చలివేంద్రములు కట్టించి బీదలయెడ దయ చూపుతాడు. వేశ్యలు కూడా దేవాలయాలకు ముడుపు చెల్లిస్తూ ధర్మ కార్యాలను, సంఘసేవను చేయుటకు తోడ్పడుతుంటారు. యుద్ధాలు, కరువులు, అగ్ని ప్రమాదాలు సంభవించినపుడు విస్తారమైన ధనం ఇటువంటివారి వద్దనుండే వస్తుందని చెప్పటానికి ఎటువంటి సందేహము లేదు. అయితే వీరు చేసే ధర్మకార్యాలను చూచి సంతోషించేవారు మానవులేకాని దేవుడు కాదు. దేవుడనే వ్యక్తి లంచగొండి కాదు. ధర్మకార్యాలు చేసినంతమాత్రాన చేసిన ఘోర నేరాలను క్షమించి స్వర్గద్వారాలను వారికోసం తెరచి ఉంచడు. లక్షలకొద్దీ దాన ధర్మాలు చేసినా, ఆ వ్యక్తిలో తన పాపం గురించి పశ్చాత్తాపము, హృదయములో మార్పు లేనియెడల ఆ వ్యక్తి దేవుని ఉగ్రతను ఎదుర్కొనక తప్పదు. మార్పు లేనివారికి నరకమే నిత్య నివాసం. దేవుడు ఎన్నడూ వెక్కిరింపబడడు. విత్తనదానినే పంటగా పొందటం అందరూ ఎరిగిన సత్యమే. మానవులు చేసే కార్యము లన్నిటినీ ఛేదించుకొని ఆ దేవుని దృష్టి వాని ఆంతర్యముమీదనే కేంద్రీకరింపబడుతుంది ఆంతర్యంలో చేసిన పాపానికి పాశ్చాత్తాపముతోపాటు నూతన హృదయం, స్వభావం అలవర్చు కుంటే నీవెంత ఘోరపాపివైనా సరే, నీవెన్ని దుండగాలలొనర్చినా సరే వాటి నన్నిటినీ క్షమించి, నీ శిక్షను రద్దుచేసి, ఆ స్వర్గంలో నీకు స్థలం అనుగ్రహించగలడు. అలా కాకుండా, హృదయంలో దురాలోచన, ద్రోహబుద్ధి, జారత్వం, అహంభావం నింపుకొని ఏటేటా లక్షలకొలదీ దానధర్మాలు చేసినా పరలోకంలో ప్రవేశం అసాధ్యం. దేవుడు పరిశుద్ధుడు. ఆయన ఉన్న స్థలములో అపవిత్రతకు స్థానం లేదు. అందుకే ఆయన కంగీకారమైన క్రియలు పవిత్ర హృదయంనుండి రావాలి "రండి. మన వివాదము తీర్చుకొందము. మీ పాపములు రక్తమువలె ఎర్రనివైనను అవి హిమమువలె తెల్లబడును. కెంపువలె ఎర్రనివైనను అవి గొర్రెబొచ్చువలె తెల్లనివగునని" పలుకుచున్న దేవునిగూర్చి తెలుసుకున్నారా ?



# ప్రతిభ

సన్మానంతోనూ పనిలేదని చెప్పమని తమ ఆహ్వానాన్ని నిర్మొగమాటంగా తిరస్కరించాడు " అన్నాడు మంత్రి

ప్రభువు ఒక్కక్షణం ఆలోచించాడు–

"మంచిది ఆయన మన దర్బారుకు రాకపోతే మనమే ఆయన దగ్గరకు వెళదాం నేను ఈ సాయంత్రం ఆయన ఆశ్రమానికి వస్తున్నట్లు కబురు చేయండి అన్నాడు

సాయంత్రం అక్బరు స్వయంగా రామానందుడి ఆశ్రమానికి వెళ్ళాడు. రామానందుడు ప్రభువును సగౌరవంగా ఆహ్వానించాడు తగిన మర్యాదలు చేశాడు

నిన్న సాయంత్రం నేను మీ సంగీతాన్ని విని ముగ్ధుణ్ణయ్యాను మా ఆస్థానంలో ఎందరో సంగీత విద్వాంసులు వున్నారు విశ్వ విఖ్యాతి నార్జించిన తాన్‌సేన్ కూడా వున్నాడు అయితే వారెవరిలోనూ లేని మాధుర్యాన్ని మీ గానంలో చవి చూచాను అందుకే స్వయంగా మీకు ఆహ్వానం పంపించాను మీరు తిరస్కరించారట అందుకని నేనే స్వయంగా మిమ్మల్ని ఆహ్వానించాలని వచ్చాను నా కోరిక మన్నించాలని కోరుతున్నాను

"ప్రభూ! మీరు ఈ దేశానికి పాలకులు కాబట్టి ఆజ్ఞాపించే అధికారం మీకుంది కాని నేను హనుమంతుడి పాదాలకు తప్ప మరే మానవునికి తలవంచి మోకరించి ఎరుగను ఏ నరమానవుడి సంతృప్తికోసమూ నేను సంగీతాన్ని వినిపించి ఎరుగను నిజానికి నేనొక గొప్ప సంగీత విద్వాంసుణ్ని కూడా కాదు పూజావసాన సమయంలో స్వామి వారికి కైంకర్యంగా ఏదో నాకు తోచిన విధంగా గొంతెత్తిపాడు తుంటాను అంతే ఈ సంగీతం సన్మానాల కోసం, బిరుదుల కోసం ఆలాపిస్తున్నది కాదు నా ఆత్మ సాక్షాత్కార భావనలో ఒక సాధనగా నేను పాడు కుంటున్నాను '

అక్బరుకు ఏం మాట్లాడాలో తెలియలేదు

పోనీయండి మీకోసం కాకపోయినా మా సంతృప్తి కోసమయినా మా ఆస్థానానికి రండి '

వద్దు, వద్దు

మీ వ్రతభంగం చేయాలని కోరికతో కాదు కనీసం సాటి రాజులలో నేనొక గౌరవాన్ని పొందాలని కోరికతో ఇలా అడుగు తున్నాను మీవంటి సంగీత విద్వాంసులు నా దేశంలో ఉన్నారనే విషయం ఇలా మీ కచ్చేరిని నా దర్బారులో ఏర్పాటు చేయించటం ద్వారా ప్రపంచానికి తెలుస్తుంది అప్పుడు మిగిలిన సంగీత విద్వాంసులంతా సిగ్గుపడి పోతారు అందుకని మిమ్మల్నిలా అర్థిస్తున్నాను "

అది విని రామానందయోగి చిత్రంగా నవ్వాడు

"ఓయి పిచ్చివాడా! నీవు పాలకునివే గాని, యోగివి కాదు అందుకని నీకు ఆధ్యాత్మిక రహస్యాలు తెలియవు ఇతర పండితులను జయించి మా విద్వత్తును ప్రజల ముందు ప్రదర్శించి వారిచేత ప్రశంసలనూ, బహుమానాలనూ పొందాలనే కోరికతో మీ దర్బారులో నేను గనక కచ్చేరి ఏర్పాటు చేసినట్లైతే ఆ మరుక్షణమే నా సంగీతం మీ చెవులకు తాన్‌సేన్ వంటి వారి సంగీతం కన్నా గూడా చాలా తక్కువగా వినిపిస్తుంది కళను నేను ఈశ్వరాంకితం చేశాను కాబట్టే ఇది దివ్యంగా భవ్యంగా వుంది నరాంకితం చేసిన మరుక్షణం వ్యాపారపు సరుకుగా మారిపోతుంది– అప్పుడు మీకందులో నిన్న విన్న మాధుర్యమూ, ఆర్ద్రతా గోచరించదు '

అక్బరుకు జ్ఞానోదయ మయింది

క్షమించండి యోగిపుంగవా!, మీరన్నట్లు నేను పాలకుణ్నే కాని యోగి సంపత్తి తెలియనివాణ్ని కాబట్టే మీ దైవీ శక్తిని అర్థం చేసుకోలేక పోయాను నా ఆహ్వానాన్ని తిరస్కరించారనే బాధ, కోపం, నాకు లేశమాత్రమైనా లేవు నా ఆస్థానంలో వున్న వారి సంగీతంలో లేని మాధుర్యం మీలో ఉండటానికి కారణమేమిటో నా కిపుడు అర్థమయింది దానిని అలాగే పవిత్రంగా ఈ ఆశ్రమ ప్రాంగణంలో నే కాపాడండి ఆత్రంతో మిమ్మల్ని నా దర్బారుకు పిలిపించాలనే

# చికాకు పెడుతున్న చిల్లర కొరత

పట్టణంలో చిల్లర సమస్య తీవ్రరూపందాల్చింది. స్థానిక ప్రజలకే గాక, చుట్టుపక్కల గ్రామాలునుంచివచ్చే ప్రజలకు కూడా చిల్లరసమస్య పెద్దదిగా తయారయింది.

–శేఖర్.


















# తేడా

## యం. ఉమామహేశ్వరరావు

రాత్రి సుమారుగా తొమ్మిదింగటలు దాటింది ఆ 'కాలనీ'లో నివశిస్తున్న వాళ్ళంతా ఎవరి యిళ్ళలో వాళ్ళు విశ్రాంతిని కోరుకుంటున్న సమయం

భోజనం ముగించి, వరాండాలో కొచ్చి, వాలు కుర్చీలో మేను వాల్చేడు సుధాకరం భర్త బొంచేసిన, తరువాత, తనూ భోజనం పూర్తి చేసి, గిన్నెలు కడిగి సర్దుతోంది వసంత వంట గదిలో వాళ్ళ పిల్లలిద్దరూ అప్పటికే భోజనాలు చేసి, బెడ్‌రూమ్‌లో మంచమ్మీద ఒకరి మీద మరొకళ్ళు కాళ్ళు వేసుకుని ఆదమరిచి నిద్రపోతున్నారు కడిగిన గిన్నెలు సర్దటం అయిందనిపించి, చేతుల్ని తుడుచుకుంటూ సుదాకరం కూర్చున్న దగ్గరగా వచ్చింది వసంత

వసంతను చూసి నోట్లో వెలుగుతున్న సిగరెట్‌ను తీసి ఆర్పేసి బయటకు విసిరేసేడు సుధాకరం అతనాపని తను చూస్తుంతగనే రోజా చేస్తాడని తెలిసినా, కనీసం అన్నైనా చేస్తున్నందుకు తనలో తనే రవ్వంత గర్వపడుతుంది వసంత

భార్యను చూసి చిన్నగా చిర్నవ్వు మెదిలింది సుదాకరం పెదవుల మీద అతని దగ్గరగా వచ్చి కూర్చుంది వసంత బయట చల్లగా ఉంది వాతావరణం

వీధి తలుపు తీసి వుండటంతో చల్లగా వీస్తున్న గాలి హాయిగా శరీరాల్ని తాకుతోంది

"ఎల్లుండి నాటికల్లా పిల్లలిద్దరికీ టెర్మ్ ఫీజులు కట్టాల్ల నేను చెప్పిన డబ్బు సంగతేంజేసేరు? వసంత నోటి వెంబడి నెమ్మదిగా వచ్చేయా మాటలు భార్య వేపు తలత్రిప్పి చూసేడు సుదాకరం నొసలు చిట్లించేడు అతని కనుబొమ్మలు విల్లులా వంపులు తిరిగి తెల్లటి అతని పాలబాగం మీద వరసగా పైకుబికిన ముడతలు స్పష్టంగా కన్పించాయి

'ఉన్న ఇద్దరు చంటి వెధవలకీ చిన్న తరగతుల్లో జాయన్నేస, పుస్తకాలూ, డ్రస్సులూ చూసుకునే సరికే తలప్రాణం తోకకు వస్తుంటే, మూణ్ణెళ్ళకో సారి వందల కొద్ది రూపాయలు ఫీజులు కట్టడం చాల బాధగా వుంది వసంతా"

గవర్నమెంట్ స్కూళ్ళల్లో చదువులు అంతరించిపోతున్నాయిప్పుడు టీచర్లున్నా పుస్తకాలుండవు అన్నీ వుంటే ఉన్న టీచర్లకు జీతాలుండవు అంతంత మాత్రంగా వున్న ఈ చదువుల వల్ల బంగారం లాటి పిల్లల భవిష్యత్తులు నాశనం అయిపోతున్నాయి పోనీ అన్నీ ఉన్న కాన్వెంట్‌లకు పరుగులు పెడితే మంచినీళ్ళులా ఖర్చయే డబ్బును చూసి మధ్యతరగతి వాడి నోటి వెంబడి మందహాసం గాదు వచ్చేది వెచ్చటి ఓ నిట్టూర్పు

బాధగా అన్నాడు సుధాకరం భర్త మాటల్ని మౌనంగానే వింటోంది వసంత

అదే సమయంలో

ప్రక్కవాటాలోంచి ఎప్పటిలాగానే వినిపించాయా కేకలు తమ బ్రతుకుల్లోని సమస్యల్తో ఉక్కిరి బిక్కిరౌతున్న ఆ దంపతులు, ఉలిక్కిపడ్డారు

వసంత లేచి అటెల్లబోయింది వారించాడు సుధాకరం 'రోజూ వినిపిస్తున్నదేగా! ఇంటింటికీ వుంది మంటిపొయ్యంటారు మనవి వెచ్చటి నిట్టూర్పులూ, వాళ్ళవి అర్థంకాని ఆవేశాలు" చిన్నగా పలికింది సుధాకరం గొంతు

"పశువును బాదినట్లు రోజూ భార్యను బాదే అతను అసలు మనిషా? లేక దున్నపోతా? అని అనుమానం నాకు పాపం" ఆవిడ దెబ్బలు తినని రోజంటూ లేదు ప్ప్ ప్ప్ ఆవేశంగా అంది వసంత

'ఈ బ్రతుకు లాటలో వాళ్ళిద్దరిదీ అదో ఆట వసంతా" వాళ్ళంతే' సుధాకరం మాటలు పూర్తి కాలేదింకా, వసంత అందుకుంది

అసలతనికి కాస్తంతయినా బుద్ధి, జ్ఞానం, వగైరాలు వుంద నక్కర్లేదా? ఆవిడా ఓ మనిషేననీ ఆమెకూ చీమూ, నెత్తురూ, మానం, అభిమానం ఉంటాయనీ గ్రహించడా? భార్య అనేది తనకు బానిసగా పడి వుండటానికేనని అతని బావం కాబోలు, రోజూ చచ్చేలా చావుదెబ్బలు కొట్టడ మేనా? ఉక్రోషంతో అంది

కొందరికి అదో కాంప్లెక్స్ వసంతా' అతనలా రెచ్చిపోతూన్నప్పుడు ఆవిడయినా నోరు మెదపక ఆగితే బావుణ్ను! మాటకు మాట ఒప్పచెప్పితే మగాడు రెచ్చిపోతాడు భార్యాభర్తలిద్దరూ ఎవరు కాస్త చిరాకుగా ఉండి కస్సు బుస్సు లాడినా, మిగిలిన వాళ్ళు సహనం చూపితే ఈ ఘర్షణలూ, కేకలూ ఉండనే వుండవు గదా! ఇద్దరికిద్దరూ ఒకటే!

సుధాకరం మాటలు రుచించలేదు వసంతకు

అయితే మీరూ అతన్నే సమర్థిస్తున్నారా? ఎంతయినా మగబుద్ధి పోనిచ్చుకున్నారు గాదు" నిష్ఠూరంగా అంది వసంత

అదిగాదు వసంతా!' నేను చెప్పేది అక్షరాలా సత్యం నా చిన్నప్పుడు మా అమ్మా, నాన్నా, కూడా ఇంతే చిన్నపిల్లలం మేము వాళ్ళు దెబ్బలాడుకుంటున్నప్పుడు భయంతో బిక్కుబిక్కు మంటూ వుండేవాళ్ళం అవీ, ఇవీ అనుకుని నోళ్ళు పీకి ఊరుకునే వాళ్ళు ఆ తరువాత సమాధాన పడే వాళ్ళు "నవ్వేస్తూ అన్నాడు సుధాకరం.

ఒళ్ళు మండింది వసంతకు

మీ వాదన నచ్చలేదు నాకు భర్త ఎన్నన్నా, ఏం చేసినా నోరు విప్పకూడదా? రేపే పిల్చి చెప్తానావిడతో 'అంటూ లేచింది వసంత

ఏవని చెప్తావు? ఆవిడకేమీ గీతా బోధ చేయకు చివరకు నువ్వే 'ఫూల్'వి అయిపోతావు వ్యంగ్యంగా అన్నాడు సుధాకరం కుర్చీలోంచి లేస్తూ కుర్చీని ఎత్తి గోడకు జారవేస్తూ తనూ భర్తతో పాటుగా లోపలకొచ్చింది వసంత

ప్రక్కింట్లో నుంచి కేకలూ, ఆవిడ మాటలూ వినిపిస్తూనే ఉన్నాయి

* * *

ఆ మర్నాడు

ఉదయాన్నే ఆఫీసుకు వెళ్ళిపోయాడు సుదాకరం. వెళ్ళేముందు మరోసారి పిల్లల ఫీజులు గురించి గుర్తు చేసింది వసంత తలూపుతూ వెళ్ళిపోయాడు

ప్రక్కింటి సరళ భర్త రామారావు కూడా మౌనంగా, తల దించుకుని నడిచిపోతుంటే, అతన్ని రాక్షసుణ్ణి చూసినట్లుగా చూసింది వసంత ఆమెలో విపరీతమైన కోపం ఆ తరువాత అసహ్యం రగిలింది

ఎంత మెత్తగా కనిపిస్తున్నాడీ మనిషి' ఆ నెమ్మదితనం మాటున పైశాచికం దాచుకున్న మనిషి రాత్రుళ్ళు రాక్షసుడిలా మారిపోయి, భార్య ఏదో అన్నందుకు ఉడికిపోయి చావగొడుతున్న ప్రబుద్ధుడు

వసంత కోప తాపాలూ ఆ స్థాయిలో ఉండగనే, పిలవని పిలుపుగా సరళ బయటకు వచ్చి, వసంతను చూసి పలకరింపుగా నవ్వింది తనూ నవ్వి, లోపలకి రమ్మంటూ చేత్తో సైగ చేసింది వసంత ఆమె లోపలకు వచ్చింది సరళనోసారి ఆపాదమస్తకం

పరిశీలించింది వసంత. రాత్రి భర్త చేత దెబ్బలు తిన్నట్లుగాని, ఏడ్చినట్లుగాని లేదు. పైగా ఎంతో ప్రశాంతంగా, చక్కగా ఉంది

"సరళగారూ! . మిమ్మల్నో విషయం అడగాలనుకుంటున్నాను "

సంభాషణకుపక్రమిస్తూ నెమ్మదిగా అంది వసంత

"రాత్రి మీరు విన్న ఆ • తిట్లూ, దెబ్బల విషయమేనా? మీరడగదల్చుకున్నది?"

చటాల్న అంది సరళ అవునన్నట్లు తలూపింది వసంత

"క్షమించండి వసంతగారూ!! ఆయనకది రోజూ అలవాటయి పోయింది అయితే నేనూ అతని అలవాటుకు అలవాటు పడిపోయాననే చెప్పుకోవాలి... ఏం చేయగల్ను చెప్పండి? ఆయన మగాడు, పైగా నా భర్త ఈ దేశంలో స్త్రీగా పుట్టడమే గాదు, భర్త అనబడే మగాడికి బానిసలా పడి బ్రతకడం యిక్కడి ఆడదాని దురదృష్టం నా ఖర్మ అలా వుంటే ఎవరేం చేయగలరు?

నిట్టూర్చుతూ అంది సరళ.

ఆ మాటలు వసంతకు నచ్చలేదు.

"అంటే? మీవారు రోజూ రాత్రిళ్ళు మిమ్మల్ని పశువులా కొడుతూ, హింసిస్తుంటే, భారతనారనీ, నా ఖర్మ యింతేనని అనుకుంటూ ఆ దెబ్బల్ని ఓర్చుకుంటూ, ఆయనకు బానిసగానే బ్రతికేస్తావంటారా?"

స్వరం కాస్త హెచ్చించి అంది వసంత

"అదేమి కాదండీ! చిన్న చిన్న విషయాల మీదనే మా తగవులు నిజానికి కూరలో ఉప్పు ఎక్కువనో సారి, తక్కువనో సారి, ఇలా ప్రతీ దానికి ఏవేవో అంటూ కొడుతుంటే నాకూ తిరగబడాలనీ, భార్యంటే బానిసగాదూ, పశువు అంతకంటే గాదూ అని అన్పించినా ఆయనలో వున్న ఒక మంచి గుణానికి లొంగిపోతుంటాను " ఆగింది సరళ

"మంచి గుణాన్నా? నోరు వెళ్ళబెట్టింది వసంత

"అవును మంచి గుణాన్నే .. చేతులు పీకేదాకా కొట్టే మనిషి అనక ఆ కోపం తగ్గేక . . విచారిస్తాడు దెబ్బల వల్ల కందిన నా శరీరానికి 'మందు' పూస్తారు పసిపిల్లాడిలా ఏడుస్తారు. తనను మన్నించమని, కోరుకుంటారు అందుకే ఆయనపై జాలి వేస్తుంది కోపం తెచ్చుకోవాలనిపించదు ఆయన కళ్ళల్లో కరిగే నీళ్ళు చూసి మనస్సు ద్రవిస్తుంది అంతే!! క్షమించేస్తుంటాను." చిర్నవ్వు నవ్వుతూ అంది సరళ.

వసంత మనస్సు మ్లానమైంది తన భర్త అన్నట్లుగానే తనిప్పుడు నిజంగా 'ఫూల్'ని అయ్యానా? అన్న ఆలోచన రగిలింది మనస్సులో అయినా ఆమె మనస్సు ఒప్పుకోలేదా ఆలోచనకు

"పోనీ, ఆయన బాగా ఉన్నప్పుడు, నచ్చచెప్పలేక పోయారా?"

అంది వసంత

"అది జరిగింది కాని తను చిరాగ్గానో, పరాగ్గానో ఉన్నప్పుడు ఏవన్నా బాధపడి తిరిగేమి అనవద్దన్నారు అవి లేవనీ, ఇవి లేవనీ బాధించవద్దంటారు ఎలా చెప్పండి వసంతగారూ!? ఇంట్లో ఏ పూటకు ఏది లేకపోయినా ఎలా గడుస్తుంది? పెద్ద వాళ్ళం మేము తలో గ్లాసూ నీళ్ళు త్రాగి ఆకల్ని చంపుకో చూసినా, పిల్లల ఆకలి తీరే మార్గం చూడాలిగా!! అసలు నిన్న రాత్రి మా గొడవ ఈ విషయం మీదనే .. వారం రోజులుగా పోరుతున్నాను ఇంట్లో బియ్యం లేవని-నిండుకున్నాయని కానీ పట్టించుకోలేదాయన మరెలా చెప్పండి? ఎంత కాలం ఆపగలను పిల్లల్ని?!!"

దుఃఖంతో సరళ స్వరం మూగబోయింది కాస్సేపు నిశ్శబ్దంగా రోదించింది కొన్ని క్షణాల నిశ్శబ్దానంతరం వసంత దగ్గర్నుంచి కదిలి తన



# తేడా

ఇంట్లోకి వెళ్ళిపోయింది సరళ

బాధగా నిట్టూరుస్తూ ఉండిపోయింది వసంత

* * * *

సాయంత్రం వస్తూనే భార్యను పిలిచాడు సుధాకరం

"ఇదిగో నువ్వడిగిన డబ్బు" రేపుదయాన్నే వెళ్ళి పిల్లల స్కూలు ఫీజు కట్టేయ్!" జేబులోంచి మూడు వందల రూపాయలను తీసి ఆమె చేతిలో వుంచుతూ అన్నాడు సుధాకరం

ఆ డబ్బు అందుకుంది వసంత. మూడు వందలు

"చెప్పిన రెండొందలకన్నా, మరో వంద ఎక్కువే తెచ్చారు. అప్పు తెచ్చారా?'

"ఎందుకొచ్చిందా సందేహం? ఆ మాత్రం ఈ తలకాయకు అప్పు పుట్టదనా?"

చిరాగ్గా అడిగేడు సుధాకరం.

"అబ్బెబ్బే" అదేంగాదు .. నెలాఖరు రోజుల్లో యింత డబ్బు పుట్టడమంటే కష్టం గదాని అన్నాను జీతాలందేక తిరిగిచ్చేయాలి గదా!! ఒచ్చే నెలది లోటు బడ్జెట్ అన్నమాట.' సమర్థించుకుంటూ అంది వసంత.

"ఉన్న విషయం చెప్పి ఓ ఫ్రెండ్ నడిగి తెచ్చాను అతనికీ రోజు పి. ఎఫ్. బాపతు లోనేదో అందిందట. అడిగిన వెంటనే ఇచ్చేడు ఎంతయినా పరపతి ఉన్న తలకాయనాది" చిరు గర్వంగా వుందతని గొంతు.

ఆ డబ్బును మరోమారు లెఖ్ఖజూసుకుంది వసంత అందులోంచి ఓ ఇరవై రూపాయల్ని తీసి, మిగతాది అతనగ్గరే వుంచుతూ, "ఈ డబ్బు మీ దగ్గరుంచండి, యిప్పుడే వస్తాను" అంటూ ఆ ఇరవై రూపాయలు తీసుకుని ప్రక్కింటి వేపు కదలబోయింది వసంత.

ఆ డబ్బు ఎవరికి? అటు తీసుకెళుతున్నావు?" భర్త ప్రశ్నకు కాస్త ఆగిందామె

"పాపం సరళ ఈ రోజు మధ్యాహ్నమే వచ్చి ఓ యాభై వుంటే ఇమ్మని అడిగింది జీతాలందిన వెంటనే ఇస్తుంది అందుకని" "

ఆగింది అర్థోక్తిలో

"అందుకని నానా తంటాలుపడి పిల్లల ఫీజులకని అప్పు తెచ్చిన డబ్బులోంచి తీసి ఆవిడ కిస్తానంటావ్!! ఎంతయినా ఆడ బుద్ధి చూపించుకున్నావు. మనకే చాలనప్పుడు మరొక్కళ్ళకు మన అవసరాలు మానుకుని యివ్వడంలో అర్థంలేదు.' భార్యనే గమనిస్తూ అన్నాడు సుధాకర్

"అసలు నాకూ ఇందులోంచి తీసి ఇవ్వాలని లేదు కాని పాపం ఇంట్లో బియ్యం గింజలు లేవంది వారం రోజులుగా ఈ విషయం చెబుతున్నా, ఆ మహానుభావుడు ఖాతరు చెయ్యలేదంట! అందుకే ఈ ఇరవై రూపాయలు యిద్దామని ఉంది. ఆవిడ అడిగినంత ఎలానూ యివ్వలేను."

జాలిగా అంది వసంత.

నవ్వేడు సుధాకరం.

"నువ్విచ్చే ఆ ఇరవైతో ఎన్ని కేజీల బియ్యం వస్తాయి.?' ఇస్తే, పూర్తిగా ఆవిడ కోరినంత ఇవ్వాలి. లేదా మానెయ్యాలి. వాళ్ళ తంటాలు వాళ్ళే పడతారు. అయినా ఓ వంద ఎక్కువే తెచ్చాను గదా!! పోనీ యాభై రూపాయల్నిఇవ్వరాదూ?!" అన్నాడు

"అమ్మయ్యో! ... యాభై రూపాయలా? అసలీ ఇరవై యిస్తేనే తిరిగి ఇస్తుందో లేదోనని ఆలోచిస్తున్నాను మీకేం తెలీదు మీరూరుకోండి! ఇవాళ వాళ్ళు అడిగినంత యిస్తే, రేపూ తయారౌతారు మళ్ళా!' అంటూ తెచ్చి పెట్టుకున్న అలంకారప్రాయమైన ఓ చిరునవ్వుతూ కదలబోయింది వసంత

సుధాకరం ఈసారి ఆమెను ఆపేడు ... 'అది కాదు వసంతా! ముందు నా మాట విను."

ఆగింది వసంత.

'అక్కడికెళ్ళే ముందు నీకో విషయం చెప్పాలి .. 'మనిషికి బాధలు వచ్చినప్పుడే తోటి మనిషి కూడా ఇలాంటి బాధలే పడతాడన్న ఆలోచనతో వుంటాడు. కాని, సుఖాల్లో వున్నప్పుడు మాత్రం ఎదుటి వాడిని గురించి ఆలోచించడు అది మనిషి నైజం కష్టాల్లో ఉన్నప్పుడు సాయం చేసేవాడే నిజమైన స్నేహితుడు అవతలవాళ్ళు ఎలాటి వాళ్ళైనా కానీ .. చిన్నయసూరి ఏం చెప్పాడో తెలుసా? తమ అవసరాలు మానుకునైనా యితరులను ఆదుకునే వాడే నిజమైన మనిషి అన్నాడు. అలాటి మనిషిని ఇవాళ ప్రత్యక్షంగా చూసేన్నేను . "ఆగేడో నిముషం

ఇంకా అలా నించునే ఉంది వసంత.

సుధాకరం స్వరం మళ్ళీ ధ్వనించింది "నిజానికి అతనింట్లో బియ్యం లేవు, కూరలు లేవు. పిల్లలకు పాల డబ్బాలు లేవు సరైన గుడ్డల్లేవు. కాని మంచితనం కొండంత వుంది వసంతా! ఆ కొండంత మంచిదనంతోనే సముద్రమంత ఆకల్ని కూడ గ్లాసేడు మంచినీళ్ళతో తీర్చుకుంటున్నారు అసలింకో విషయం.." ఏదో చెప్పబోతున్న సుధాకరాన్ని ఆపింది వసంత.

"మీరు చెప్పేది తీరిగ్గా వింటాను గాని, ముందీ డబ్బు పాపం ఆ సరళ కిచ్చేస రానీయండి!! నాకోసం చూస్తుండవచ్చు" కదలబోయింది.

'అఖ్ఖర్లేదు'. నువ్వాడబ్బు వాళ్ళకివ్వనఖ్ఖర్లేదు." పెద్ద స్వరంతో అన్నాడు.

"ఏం? . ప్రశ్నించింది వసంత.

"ఏవేమిటి? అసలు నాకు డబ్బిచ్చిన స్నేహితుడు మరెవరో గాదు. మన ప్రక్కింటి సరళ భర్త రామారావే!!!"

నిర్ఘాంత పోయింది వసంత నమ్మనట్టుగా చూసింది "అవును వసంతా!! అతనే .. పాపం యింట్లో అవసరం కోసం పి. యఫ్. లోను తీసుకున్న రామారావు, నేను అడక్కపోయినా, ఇంకొకళ్ళ ద్వారా తెల్సుకొని తీసుకొచ్చి బలవంతంగా నాకిచ్చాడు. అడిగినవి నిజానికి రెండు వందలే అయినా ఎందుకైనా అవుసరం పడతాయంటూ మరో వంద కలిపి ఇచ్చేడు.... ఎదుటి మనిషిని అర్థం చేసుకుని సహాయం చేసే దంటే నిజంగా అతను మనం రోజూ చూస్తున్న రామారావేనా అన్పించింది "

ఆగేడు సుధాకరం వసంత వేపు చూసేడు. వసంతలో ఏదో మార్పు కనిపిస్తోంది మరేదో పశ్చాత్తాపం రగులుతోంది.

"చూసేవా? అదేనోయ్ జీవనరాగం అంటే!. మానవత్వం అన్న పదానికి నిర్వచనమూ యిదే . చిన్నయసూరి చెప్పిన నీతిలో కూడా యిదే భావం. రెండొందల కోసం చూస్తున్న నాచేతిలో మూడొందలుంచి ఆదుకున్న మనిషికీన్నీ!.

.. . బియ్యం కోసం యాభై రూపాయలు సాయం చేయమన్న సాటి ఆడదానికి, చేతిలో యింత డబ్బుందీ కూడా కేవలం తిరిగివ్వరేమోనన్న భయంతో ఇరవై రూపాయలు ఇస్తున్న నీకూ ఎంత "తేడా" వున్నదో ఆలోచించుకుని మరీచెప్పు?!!!...."

లేచి తన గదిలోకి వెళ్ళిపోతున్న సుధాకరం వేపుగా రెప్పవేయకుండా చూస్తూనే ఉండిపోయింది పాపం వసంత . □



జీవితమే స్వర్గం

కంగ్రాచ్యులేషన్స్ మేడమ్! మీ మొదటి జీతానికి!!

అవునండీ! ఈరోజు నాకెంతో సంతోషంగావుంది

మీరు ఒంటరి వారేగా- ఈ ఆనందాన్ని మరి రెట్టింపు చేసుకోరూ!

మీ ఉద్దేశం?

మీ ఇబ్బందులు మీరు చిర్నవ్వుతో ఎదుర్కోవాలి అన్నదే నా ఉద్దేశం!

1

రు50/-

ప్రతి నెల జీతం రోజునే పొదుపు ప్రారంభించండి.

పేరోల్ సేవింగ్స్ స్కీమ్‌లో రు.50/- ఆదా చేస్తే...

ఊఁ- చేస్తే...

10 సం॥ల తర్వాత 8 వేలకు పైగా వస్తుంది- ఇన్‌కంటాక్స్ భారం కూడా లేదు!

ఓహ్, నిజంగానా! ఐతే 50 కాదు- నెలనెలా వంద చొ॥న జీతంరోజునే ఆదా చేస్తానండోయ్!

అలా ఐతే మీకు 17 వేలకు పైగా వస్తుందండోయ్!

* 5 సం॥ల రికరింగ్ డిపాజిట్ పథకంలో మీరు చేసే పొదుపుపై వచ్చే వడ్డీ మీద రు 7000/-దాకా ఆదాయపన్ను మినహాయింపువుంది.

* 10 సం॥ల సి.టి.డి. లో పొదుపుచేస్తే మీకు లభించే వడ్డీ ఎంతయినా అసలుపన్నే వుండదు.

* ప్రతినెల రు 100/- సి. టి. డి. లో పొదుపు రు. 17,432/- దాకా 10 సం॥లు గడిచాక మీచేతి కందుతుంది.

వివరాలకు - ఏ పోస్టాఫీసు లోనైనా, మీ జిల్లా కలెక్టరు కార్యాలయంలోని జాతీయ పొదుపు అధికారులనుకానీ, జాతీయ పొదుపు ఏజంట్లను కానీ, లేదా



కమీషనర్
స్మాల్ సేవింగ్స్
H. No. 3.6.237/2
హిమాయత్ నగర్
హైదరాబాదు - 500 029
ఆం. ప్ర.



జాతీయ పొదుపు సంస్థ



పొదుపు నేర్చుకో ముందర - ఖర్చుకెందుకు తొందర

KPA/CSS85.W.1

సీరియల్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె. రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

ఇంటి దగ్గర అమమ్మ హడావిడి ఎక్కువైపోయింది ఆమె మాటి మాటికి భూదేవికి కబురు చేసి పిలిపిస్తున్నది ఇద్దరూ కలిసి ఏవేవో పెళ్ళి ముచ్చట్లు చేస్తున్నారు' అప్పుడప్పుడూ బజారుకు వెళ్ళి ఏవేవో కొనుక్కొని వస్తున్నారు'

పది రోజులలో రవి మామూలు మనిషి అయాడు నీరసం తగ్గింది' ఆపరేషన్లు వంటరిగా చేయగల్గుతున్నాడు ఆదివారం సాయంత్రం నర్సింగ్‌హోమ్ చూస్తుండమని రాధాకృష్ణకు చెప్పి టాక్సీలో విజయవాడ వెళ్ళాడు దారిలో బుట్టెడు తెల్ల గులాబిలు కొని ఇందు ఇంటికి వెళ్ళాడు వీధిలో టాక్సీ ఆపి గులాబి బుట్ట చేతిలో వుంచుకుని ఇందు పోర్షన్ ఎడ్రస్ కనుక్కొని వెళ్ళి తలుపు తట్టాడు

ఎంత సేపు తలుపు తట్టినా జవాబులేదు అప్పుడు చూసాడు తను తలుపు తాళం పెట్టి వుండడం' పక్క పోర్షన్‌లో వుండే అమ్మాయి వచ్చి-

ఆంటీ బొంబాయి వెళ్ళిపోయింది''

ఎప్పుడు వెళ్ళింది?' ఆతురతగా అడిగాడు రవి

"వారం రోజులయింది!"

"బొంబాయిలో ఇందువదనగారి అడ్రస్ చెప్పగలరా?

ఎడ్రస్ తెలియదు' ఆంటీవాళ్ళ నాన్న అక్కడ పనిచేస్తున్నాడు?'

ఏ డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తున్నాడు?"

'ఏమో మాకు తెలియదు'"

"ఆమె మళ్ళీ ఇక్కడకు రాదా? సామాను తీసికెళ్ళటానికైనా ?"

'సామాను తన వెంటే తీసుకెళ్ళింది ఇంటాయన ఆ పోర్షన్ ఎవరికో అద్దెకిచ్చాడు కూడాను '

ఇక వుండి ఎన్ని ప్రశ్నలు అడిగినా ప్రయోజనం వుండదనుకుని టాక్సీని కాలేజి దగ్గరకు పోనిచ్చాడు వాచ్‌మన్‌ను అడిగి ప్రిన్సిపాల్ అడ్రస్ తీసుకుని ఆయన ఇంటికి వెళ్ళాడు

'సార్ ఇందువదన అడ్రసు ఇవ్వగలరా? అని అడిగాడు

ఏమోనండి' అర్ధాంతరంగా వుద్యోగానికి రాజీనామా కూడా చేయకుండా వెళ్ళిపోయింది వెళ్ళే ముందు నాకు కనపడలేదు కూడాను'

నిన్న బొంబాయి నుండి ఈ ఉత్తరం మాత్రం వచ్చింది అంటూ వుత్తరం ఇచ్చాడాయన

సర్,

కొన్ని వ్యక్తిగత కారణాల వలన నేను అర్ధాంతరంగా ఇలా వచ్చేయవలసి వచ్చింది ఈ ఉత్తరంలో జత చేసిన నా రాజీనామాను అంగికరించవలసిందిగా కొరుకుంటున్నాను మీకు ఇబ్బంది కలిగించినందుకు క్షమించాలి

ఇందువదన

ఇందు అడ్రస్ కోసం వుత్తరం అంతా వెతికాడు ఎక్కడా అడ్రస్ ఇవ్వలేదామె'

చూశారా' అడ్రస్ యివ్వలేదు' ఆమె ఇలా ఎందుకు చేసిందో అర్ధం కావడంలేదు' కారణం ఏదయినా మేము ఒక మంచి లెక్చరర్‌ను పోగొట్టుకున్నాము "

ఆయన వద్ద సెలవు తీసుకుని వచ్చేసాడు రవి

* * * * *

ఉత్తరదేశం చూద్దామని రఘుతో పాటు ప్రయాణమైంది మంజ నరసమ్మగారు ప్రేమతో చేసి యిచ్చిన పులిహోర, లడ్లు, చక్రపొంగలీ కారియర్లు తీసుకుని సూట్‌కేస్‌లతో సహా జి టి ఎక్స్‌ప్రెస్ ఫస్ట్ క్లాసు కూపేలో ఎక్కారు రఘు, మంజ

చేదు జ్ఞాపకాలకు దూరంగా పోవాలని వొకరు, ప్రేమించినవాడి మనసు తన ముద్దుల చెల్లి మీద లగ్నమైందని తెలుసుకుని వొకరు గుంటూరు నుండి ఎంత దూరంగా వెళ్ళిపోతే అంత మంచిదని నిర్ధారించుకున్నారు'

రఘు మనసు, శరీరం దస్సి వున్నాయి నీరస స్థితిలో వున్న అతనికి ధైర్యం చెబుతూ తోడు నీడగా వుండే ఆత్మీయుల సాంగత్యం అవసరం' మంజ వున్న చోట విచారం దరికిరాదు అని అతని దృఢ విశ్వాసం' కష్ట కాలంలో తనను రక్షించి ఒక విధంగా ప్రాణదానం చేసిన మంజ అంటే అతనికి అభిమానం ఎక్కువయింది' మంజ అమ్మను కూడా మార్చేసింది అనుకుంటే అతనికి మంజ మీద గౌరవం, వొక విధమైన భక్తి భావం పొంగేది బలహీనమైన తన శరీరం ప్రేమాఘాతంతో తూట్లుపడ్డ మనసుతో వొంటరిగా వుండటానికి భీతిల్లిపోతున్నాడు అందుకే మంజ రమ్మనగానే ఆమె వెంట బయల్దేరి వచ్చాడతను యం బి బి యస్ చదివేప్పటి నుండి రఘుకు మంజ అంటే ఒక విధమైన అభిమానం, ఆరాధన' ప్రాక్టికల్ జోక్స్ వేస్తూ అందరనూ కవ్విస్తూ నవ్విస్తూ వుండే మంజతో స్నేహం చేయాలనే అతని తపన తల్లి చాదస్తం వలన భంగపాటు చెందింది ఆ తర్వాత మంజ అమెరికా వెళ్ళటం, తను ఇక్కడ యం బి బి. యస్ చేసి లిల్లీ ప్రేమలో పడి భంగపాటు చెంది ఆ తర్వాత ప్రాణాలు తీసుకోవాలని ప్రయత్నించి విఫలుడై ఇప్పుడిలా మంజతో యాత్రకు

**జరిగినకథ -14:** ఇందువదన ఆప్తమిత్రుడు చంద్రహాస్ గుంటూరులోని రవిగారి శశ్రుత నర్సింగ్ హోమ్‌లో చేరాడని తెలిసి అతనిని చూడడానికి గుంటూరు వస్తుంది ఇందువదన. చంద్ర, రాకేష్ ఇందువదన పేరు కలవరించడం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది అమెరికా నుండి వచ్చిన తన క్లాసుమేటు మంజ ఇందుకి పెద్దమ్మ కూతురని తెలుసుకుంటాడు రవి. ఇందుపై అభిమానం పెరిగింది మంజ, రవి సన్నిహితంగా ఉండటం చూచిన ఇందు మనసు వ్యాకులం చెందుతుంది రవి జ్వర తీవ్రత చూస్తే మంజకి భయంవేసింది మెడిసిన్ ప్రొఫెసర్ రామారావు వచ్చి రవిని చూసినా అతని పరిస్థితి మెరుగవలేదు సావిత్రమ్మ కోలుకుంది ఆమె మంజ, రవిల వివాహం జరిపిస్తామని చెపుతుంది ఇందు విజయవాడ వెళుతున్నానని చెప్పినప్పుడు ఆమె మనసు తీవ్రంగా గాయపడిందని తెల్సుకుంటాడు చంద్ర రవి, రఘు ఇద్దరూ బాగా కోలుకున్నారు మంజ, రఘు ఆగ్రా వెళ్ళిపోయారు రవి ఇందు పనిచేసే కాలేజికి ఫోను చేస్తే ఆమె గురించి ఇన్‌ఫర్మేషన్ దొరకలేదు



బయల్దేరాడు

మంజ తన ప్రాణాలైతే నిలిపింది గాని మనసులో విపరీతమైన పిరికితనం పెరిగిపోయింది చిటికి మాటికి వులికిపడటం కన్నుమూస్తే కవ్విస్తూ లిల్లీ రూపం - సుందరమైన ఆమె ముఖం యాసిడ్‌తో వికృతమై భీకరంగా అరుస్తూ కనపడటం, అంతలోనే మేడమీద నుండి దుమికి ఆమె తల చిట్లి రక్తసిక్తమై నేలమీద చచ్చిపడి వుండటం - నిజానికవన్నీ అతను చూడకపోయినా చూచినట్లు కళ్ళ ముందు భ్రాంతి కలగడం - తర్వాత నరాలలో విపరీతమైన వణుకు భయం, కెవ్వున కేక వేయాలనే కోరిక - ముందు వెనకలుగా రక రకాలుగా అనుభూతులతో మనసు నిండిపోయి ఆఖరులో నిస్తేజంగా శరీరం వుండిపోవడం జరుగుతున్నది

రైలులో మంజుతో ప్రయాణం అంటే నవ్వుల విందు ఆరగించటం అనుకున్నాడు రఘు!

కాని మంజు రైలెక్కిన దగ్గర్నుండి ఎంతో ముబావంగా వుంటున్నది మనసులో ఏదో తీవ్రమైన ఆలోచనలు చెలరేగుతున్నట్లు గంభీరంగా వున్నది



చిరునవ్వులు చిందించే ఆమె కళ్ళు శరన్మేఘావృతమైన ఆకాశంలా గంభీరంగా వున్నాయి గలగల నవ్వే జలపాతంలాంటి ఆమె గొంతు నిశ్శబ్దంగా వుండిపోయింది

వోదార్చి తన బాధలు తీర్చుతుందని అనుకున్నాడు ఆమె స్నేహామృత ధారల్లో తన మనసులోని ఆవేదనా జ్వాల చల్లారుతుందనుకొన్నాడు!

చింతాక్రాంతయైన మంజును చూడగానే రఘు నిర్విణ్ణుడయాడు నవ్వుల నయాగరా మంజుకు కూడా దిగులా!

'ఏమిటి మంజూ అలా వున్నావు?

రఘు మాటలకు సమాధానంగా వెక్కి వెక్కి ఏడవసాగింది మంజు అనుకోని హఠాత్పరిణామానికి చలించిన రఘు ఆమె దగ్గరకు వెళ్ళి మంజూ! ప్లీజ్!

# శుశ్రుత నర్సింగ్ హోమ్

నువ్వలా ఏడుస్తుంటే నాకెదోలా వుంది' అంటూ ఆమె తలను పైకెత్తి కుడచేతి చూపుడు వేలితో బుగ్గలమీద జాలువారుతున్న కన్నీటిని తుడవసాగాడు

మంజూ' న బాద ఏమిటో నాకు చెప్పవూ?

సమాదానంగా బావురుమని ఏడ్చింది మంజు పుట్టిన దగ్గర నుండ ఇన్ని సంవత్సరాలుగా ఆమె ఏడ్చి ఎరగదు' ఫెళ పెళలాడించిన ఎండాకాలం తర్వాత వచ్చే బీకర వర్షంలా ఏడ్పు ఎరుగని మంజు జీవితంలో మొదటిసారిగా విలపిస్తున్నది' కట్టలు తెగిన విషాద సాగరం ఆమెను ముంచెత్తింది

ఆమె అలా కొంతసేపు ఏడ్చితే మనసులోని వ్యద కరగి ద్రవించి కన్నీరుగా వెలికివచ్చి హృదయం తేలిక పడుతుందనిపించింది రఘుకు

యం బి బి యస్ చదివేప్పుడు మంజు, రవి చాలా క్లోజ్‌గా వుండేవాళ్ళు అమెరికా నుండి తిరిగి వచ్చిన దగ్గర్నుండి ఆమె రవి ఇంట్లో వుంటూ శుశ్రుత నర్సింగ్‌హోమ్ చూస్తూ వుండటం చూచినవాళ్ళు ఈ మంజు రవిని పెండ్లాడి అమెరికా వెళ్ళిపోతుంది లేదా వివాహానంతరం తను ఇక్కడే వుండిపోయి నర్సింగ్‌హోమ్ డెవలప్ చేస్తుంది

రవి అదృష్టవంతుడు అనుకున్నారు' 'రవి మంజుల ప్రేమకు ఏదో అవాంతరం అడ్డుపడి వుంటుంది, లేకపోతె యీమె ఇలా వంటరిగా ఉత్తరదేశానికి ఎందుకు బయల్దేరుతుంది' అని మనసులో అనుకుని-

మంజూ' రవి నిన్నేమయినా అన్నాడా? లేకపోతే నీకు ఇంత బాద కలుగవలసిన అవసరం ఏమిటి? అని అడిగాడు రఘు

రఘూ' ఇప్పుడు మంజు పరిస్థితి నీ స్థితి ఒకటే' యం బి బి యస్ పాసయాక మా నాన్నగారు సావిత్రమ్మ గారితో మా పెళ్ళి విషయం కదిపినప్పుడు,

ఇంట్లో ఎల్లవుండగా పరాయి సంబంధం ఎలా చేసుకుంటాం అని అంది ఆ తర్వాత ఇక్కడ వుండలేక అమెరికా వెళ్ళిపోయాను పోయానే గాని నా మనసులో నుండి రవిని తొలగించుకోలేక పోయాను ఇండియా తిరిగి రావటానికి అవకాశం దొరకగానే రెక్కలు గట్టుకు తిరిగివచ్చి వాలాను

ఒకేసారి రవి, సావిత్రమ్మగారూ ఇద్దరూ అస్వస్థులైతే ఇల్లూ, హాస్పటలూ నాదేననుకుని సమర్థించుకు రాసాగాను

రవి మృత్యుముఖంనుండి బయటపడుతుంటే చూచి అంతులేని ఆనందం పొందాను కాని నా సంతోషం అతి త్వరలో హరించుకుని పోయింది

సావిత్రమ్మగారి మనసు పూర్తిగా మారిపోయింది రవి భార్యగా నేను యిల్లూ, శుశ్రుత నర్సింగ్‌హోమ్ చక్క దిద్దాలని ఆమె కుండ బద్దలు కొడుతున్నది ఉన్న ఆటంకం ఇలా అదిగమించాను అని సంతోషపడుతున్న సమయంలో రవి మనసు నామీద లగ్నం కాలేదని, అతను నా చెల్లెలు ఇందుమీద మనసు పడుతున్నాడని తెలిసింది' సావిత్రమ్మగారి మంకుపట్టు నాకు తెలియంది కాదు రవి మెడలు వంచి అతను నన్ను వివాహమాడటానికి ఆమె శతదా ప్రయత్నిస్తుంది' బతిమిలాడో, భయపెట్టో అతన్ని వొప్పించటానికి తాపత్రయ పడుతుంది'

మనసులేని వివాహం చేసుకుని చెల్లెలు జీవితంలో నిప్పులు పోసేదా? మనసైనవాడిని వదులుకుని జీవితం అందకార బంధురం చేసుకునేదా?

నా కష్టు తొలగాలనే ఉద్దేశంతో ఇందు వుద్యోగానికి రాజీనామా ఇచ్చి బొంబాయి వెళ్ళిపోయింది' జీవితంలో మొదటిసారి సంక్లిష్ట పరిస్థితి ఎదురయింది' ఎటూ ఆలోచించుకోలేక ఏమి పాలుపోక ఇలా బయలుదేరాను నా మనసును ఉక్కిరి బిక్కిరి చేస్తున్న చిక్కుముడిని విప్పుకోలేక సతమతమవుతున్నాను

మనసులోని వ్యదను మాటల్లో వ్యక్తీకరించినందువల్లనో ఏమో మంజు ముఖంలో మరలా ప్రశాంతత చోటు చేసుకుంది

రఘు మనసు మెత్తన తనకు గాని ఇతరులకు గాని కష్టంవస్తే సహించలేడు విపరీతంగా బాద పడతాడు త్వరగా ద్రవించే అతని ఆర్ద్ర హృదయం ఇప్పుడు వజ్ర హృదయ అయిన మంజు మనోవేదన చూచి చలించి పోయింది మంజు ఇలా బాదపడుతున్నదంటే ఆమె రవిని ఎంతగా ప్రేమించిందో? ఇన్ని వేలమైళ్ళు అతనికోసం తిరిగి వచ్చి తన ప్రేమ సఫలీకృతం కాబోయె సమయానికి అతని మనసును వేరొక వనిత, తన చెల్లి దోచుకుందని తెలిసి హతాశురాలయింది' ఈమెను వోదార్చి మామూలు మనిషిని చేయాలి అనుకుంటూ రఘు –

ఈ రఘు నా వలెనే ప్రేమోపహతుడు' మెత్తని హృదయం కలవాడు ఏమాత్రం కష్టం వచ్చినా వోర్చుకోలేడు ఇప్పుడు మా ఇద్దరి పరిస్థితి వొకటిగానే వున్నది' ఇద్దరం దురదృష్టం అనే పడవలో పయనించే నావికులం- అని మంజు అనుకుంటూ వుంటే ఇద్దరి మనసులూ అనుకోకుండా దగ్గరయినాయి'

మంజూ' ప్లీజ్' నువ్విలా బాధపడుతుంటే నేను చూడలేను' నాకోసం అయినా నువ్వు ఇలా దిగులుపడటం మానివేయాలి అంటూ ఆమె రెండు చేతులూ పుచ్చుకుని బతిమిలాడుతున్న రఘు గుండెపై తలానించి వుండిపోయింది మంజు కనులు మూసుకుని వుండిపోయిన ఆమె కురులు చేతితో నిమురుతూ వుండిపోయాడు రఘు'

* * * * *

రవి నర్సింగ్‌హోమ్‌లో వోపి చూస్తూ వున్నాడు అలసిపోయిన అతని శరీరం, మనసు విశ్రాంతి కోరుతున్నా వృత్తి ధర్మం అతన్ని అలవాటుగా పని చేసుకుపోయేట్లు చేస్తున్నది వోపి అయిపోయి ఇంటికి వెలుతుంటే చంద్ర వచ్చాడు






విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శ్రీశ్రీ, తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి, కాటూరి వెంకటేశ్వరరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర-శర్మ, భావరాజు వెంకట కృష్ణారావు , రాయప్రోలు సుబ్బారావు, పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర, పిలకా గణపతిశాస్త్రి, విద్వాన్ విశ్వం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీరంగం నారాయణబాబు, గొబ్బూరు వెంకట రాఘవా

# భారతి

## సాహిత్య మాసపత్రిక

నందరావు, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పానుగంటి లక్ష్మీ నరసింహారావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, జి. వి. కృష్ణారావు, కె. వి. రమణారెడ్డి, నిఖిలేశ్వర్, మల్లంపల్లి శరభయ్యా, కొత్త సత్యనారాయణ చౌదరి, జాషువ, కవి కొండల వెంకటరావు, చిలుకూరి వీరభద్రరావు, వేలటూరి వెంకటరమణయ్యా, వేదం వెంకటరాయశాస్త్రి, వఝ్ఝల కాళిదాసు, ఆర్. ఎస్. సుదర్శనం, చలం, రాచకొండ విశ్వనాధశాస్త్రి, బలివాడ కాంతారావు, చక్రవర్తి రాజగోపాలాచారి, చేకూరి రామారావు, తుమ్మల సీతారామ మూర్తి, బి. జి. ఎల్. స్వామి, నిడుదవోలు వెంకటరావు, హెచ్. ఎస్. బ్రహ్మానంద, సర్దేశాయి తిరుమలరావు, ఆరుద్ర, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి, విక్రాల శేషాచార్యులు, దాశరథి, డా. సి. నారాయణరెడ్డి, గుంటూరు శేషేంద్రశర్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్.

# శుశ్రుత నర్సింగ్ హోమ్

ఏం చంద్రా బాగున్నావా? అని అడిగాడు రవి

మి దయవల్ల, మంజుగారి దయవల్ల బాగున్నాను సార్

'రా ఇంటికి వెళదాం'

ఇంటి దగ్గర మేడమిద గదిలో కూర్చున్నారిద్దరూ'

చంద్రా' ఇందుకు నీకంటే ఆత్మీయులైన స్నేహితులు లేరని నాకు తెలుసు ఆమె ఇక్కడ నుండి, ఆ తర్వాత విజయవాడ నుండి అర్ధాంతరంగా ఎందుకు వెళ్ళిపోయిందో చెప్పగలవా?

ఆమె ఎవరినో చాలా గాఢంగా ప్రేమించింది' తాను ప్రేమించిన వ్యక్తిని పొందలేను అనే దృఢనమ్మకం ఆమెను బాగా కృంగదిసింది ఆ దిగులుతో ఆమె అలా అర్ధాంతరంగా వెళ్ళిపోయింది'

అలాగా' ఆమె అడ్రసు ఇవ్వగలవా?

ఇందు అడ్రసు వ్రాసి ఇచ్చి, రవి దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు చంద్ర

రవి మనసు కల్లోల సాగరంలా మారిపోయింది' ఇందు అంతగా బాధపడిపోవలసిన అవసరం ఏమొచ్చింది?

అమ్మమ్మ, భూదేవి తను మంజును వివాహం చేసుకుంటాడన్నట్లు మాట్లాడుకుంటూ వుంటే, ఆమె విని అక్క మార్గానికి అడ్డు రాగూడదని వెళ్ళిపోయిందా?

తనకు, అమ్మమ్మకు అస్వస్థత ఏర్పడ్డప్పుడు మంజు చాలా చాకచక్యంగా ఇల్లూ, నర్సింగ్‌హోమ్ సరిదిద్దుకు రావడం చూచి అమ్మమ్మ మంజుపై మనసు పడింది' నిజానికి తనకు మంజుకంటే సరిఅయిన జోడి మరివొకరుండరు అనేక సంవత్సరాల ఆత్మీయ స్నేహమేకాక శుశ్రుత నర్సింగ్ హోమ్‌ను నడపటానికి తగిన సహాయ సంపర్కం అందజేయగల శక్తియుక్తులామెలో వున్నాయి' ఆమె మనసు తనమిద లగ్నమైవున్నదని కూడా తెలుసు' కాని

ఇటు ఇందు' లేతగులాబి మొగ్గలాంటి ఇందు– తన మనసు పూర్తిగా అర్థం చేసుకోగల రచయిత్రి ఇందుతో పరిచయం అవకపోతే మంజును వివాహ మాడటానికి ఏ విధమైన అభ్యంతరం వుండేది కాదు'

సంపెంగ లాంటి మంజు, గులాబి మొగ్గలాటి ఇందులలో తన మనసు ఏవైపు మొగ్గు చూపుతున్నదో తెలుసుకోగల శక్తి కలది ఇందు

ఆమె ఇలా అర్ధాంతరంగా తనతో చెప్పకుండా వెళ్ళిపోయిందంటే వొకటే కారణం వుండి వుంటుంది' అక్క దారికి అడ్డు రాకుండా వుండాలనే తపనతో నే ఆమె తనకు దూరమైవుంటుంది'

ప్రేమ త్యాగాన్ని బలిగా కోరుతుంది' తనను ప్రేమించిన వాడి మేలుకోరి అతనికి దూరమై పోవాలనుకున్నది ఇందు' ఆమె వంతు కర్తవ్యం ఆమె నెరవేర్చుకున్నది కాని తన మనసు నిండుకు వుండిపోయిన ఇందు రూపం తను ఎంత ప్రయత్నం చేసినా తొలగించుకోలేక పోతున్నాడు

ఇందూ' నాకెందుకు కనపడ్డావు? కనపడ్డావు పో నా మనసంతా ఎందుకు దోచుకున్నావు? దోచుకున్నావు పో ఇలా అర్ధాంతరంగా చెప్పా చెయ్యాకుండా ఎందుకు మాయమయ్యావు? మాయమయ్యావు పో ఇలా నన్ను నీ జ్ఞాపకాలతో ఎందుకు వేధిస్తున్నావు' అనుకుంటూ నిద్రపట్టక మంచంమిద అటూ ఇటూ దొర్లుతూ జాగారం చేసాడు రవి' తెల్లవారి లేస్తూనే ఫోన్ చేసి హైద్రాబాద్ బస్‌లో టికట్ రిజర్వు చేయించుకున్నాడు హైద్రాబాద్ చేరి అక్కడ నుండి బొంబాయి వెళ్ళిపోవాలని అతని ప్లాను

అమ్మమ్మా' ఈ రాత్రికి బయల్దేరి బొంబాయి వెళుతున్నాను వారం రోజులలో తిరిగి వస్తాను అన్నాడు సావిత్రమ్మగారితో

అదేమిట్రా? జబ్బుపడి నీరసంగా వున్నావు' ఇప్పుడు అంత దూరప్రయాణం ఎందుకు పెట్టుకున్నావు?

అవసరంగా వెళ్ళి రావాలె' తప్పదు అంటూ నర్సింగ్ హోమ్ వైపుకు నడుచుకుంటూ వెళ్ళాడు

రాధాకృష్ణకు ఫోన్ చేసి అవసరంగా నేను బొంబాయి వెళ్ళవలసి వచ్చింది వారం రోజులు నర్సింగ్‌హోమ్ చూస్తూ వుండాలి' అని అడిగాడు

అతను 'సరే' ననగానే రవి మనసు ఎంతో తేలికపడింది వోపి చూసి వార్డులలో వున్న ఇన్‌పేషెంట్లందరనూ రాధాకృష్ణకు ఇన్‌ట్రొడ్యూస్ చేసి సాయంత్రం అయిదింటికి ఇంటికి వెళ్ళాడు

హైద్రాబాద్ బస్ ఆరింటికి బయల్దేరుతుంది' స్నానం చేసి బట్టలూ సూట్‌కేస్‌లో సర్దుకుని టాక్సిలో బస్ స్టాండ్‌కు వెళ్ళబోతుంటే హాస్పటల్ నుండి ఫోన్ వచ్చింది

సార్' కడుపు నొప్పితో బాధపడుతూన్న ఆమెను తీసుకువచ్చారు'రాధాకృష్ణగారు ఏదో ఎమర్జన్సీ ఆపరేషన్ చేయటానికని విజయవాడ వెళ్ళారట అంది సరోజ

టాక్సి నర్సింగ్ హోమ్ ముందు ఆపి లోపలకు వెళ్ళాడు రవి ఇరవై సంవత్సరాల యువతిని ఎగ్జామినేషన్ టేబిల్ మిద పడుకోబెట్టారు తెల్లగా పాలిపోయి వుందామె నాడి చాలా బలహీనంగా వుంది బి పి రీడింగ్ తెలియడం లేదు పొత్తికడుపు వుబ్బి వున్నది పరీక్ష చేసి ఎక్టోపిక్ గెస్టేషన్ అని నిర్ధారణ చేసుకున్నాడు రవి'

క్షణం సేపు నిర్ఘాంతపోయి కుర్చిలో కూర్చుండి పోయాడు' ఈ అమ్మాయిని ఇలాగే గవర్నమెంట్ ఆస్పత్రికో, మరో ఆస్పత్రికో రిఫర్ చేస్తే?

ప్రమాద స్థితిలో వున్న రోగిని అటూ ఇటూ పంపి కాలయాపన జరిగితే ప్రాణమోసం తప్పదు' వృత్తిదర్మం ఒకవైపు, ఇందును చూడాలనే తపన వొకవైపు మనసును కల్లోల పరుచసాగాయి రవిని'

వైద్యవృత్తి ఒక పవిత్ర ధర్మం' ఆ ధర్మ నిర్వహణలో అనురాగపాశం అడ్డు రాకూడదు' అని నిర్ణయానికి వచ్చాడతను'

సరోజను పిలిచి దియేటర్ రెడి చేయమని చెప్పి టాక్సిలోని సూట్‌కేస్ లోపల పెట్టించాడు'

ప్రమాద స్థితిలో వున్న రోగి ప్రాణ పరిరక్షణ యత్నంలో పడిపోయిన రవి మనసు నుండి ఇందు గురించిన ఆలోచనలు తాత్కాలికంగా తొలగిపోయాయి' అతనిని వైద్యవృత్తి అనే పవిత్ర ధర్మం అడ్డుపడి ఆపివేసింది

(అయిపోయింది)



# టీ.వీ. లో కాలేజీలకు విద్యాబోధనలు

Sarathi

ఇప్పటి వరకు మనం చేసిన ప్రాక్టికల్స్
ఇక చాలిద్దామా..!! సెలవ్...







చూడండి! ఇప్పుడు
ఈ టోటల్ 1234.56
వచ్చిందిగా దాన్ని 6543.21
లాంటి -- చెయ్యండి!

చెప్పండి! టీ.వీ.గ్లాస్‌లు ఎవ్వరు పగల
కొడ్తున్నారు..?! దాన్లోని పార్ట్స్ ఎవ్వరెత్తుకు
పోతున్నారు..?!






ఇప్పటి వరకు మీరు సగం లెక్కలర్థం
చేసుకున్నారుగా! మిగతా లెక్క వచ్చేవారం
ఇదే రోజు చూస్తారు.



# ఇప్పుడు తెలిసింది

## కె.కె. రఘునందన

"నీకేంరా బాబూ! ఆఫీసైపోయింది కదా! ఎంచక్కా యింటికెళ్ళి పెళ్ళాంతో కబుర్లు చెబుతూ కూర్చుంటావు! నన్ను చూడింకా బ్రహ్మచారిగాడ్ని రూంకి పోయి వంట వండుకోవాలింకా' గోడ గడియారం అయిదు గంటలు కొట్టడంతోనే ఫైల్స్ మూసేసి బయట కొచ్చాక నాతో అన్నాడు సూర్యారావు

పోనీ! నువ్వు పెళ్ళి చేసుకుని ఆఫీసైపోయిని దగ్గర్నుంచీ పెళ్ళాంతో కబుర్లు చెప్పకూడదూ! అన్నాను హాస్యంగా

అలా యిద్దరం మాట్లాడుకుంటూ బొంకుల దిబ్బ దగ్గిర టీ త్రాగాం

పది నిముషాల తర్వాత వస్తానని చెప్పి యింటికి దారి తీసాను

ఔను! సూర్యారావు అన్నదాంట్లో అర్థం లేకపోలేదు సాధారణంగా పెళ్ళయిన క్రొత్తలో త్వరగా చేరాలని తన కోసం పెళ్ళాం ఎదురుచూస్తుంటే - తను పట్టుకెళ్ళిన మల్లెపూలు తురమాలని తరువాత తీరిగ్గా తీపి వూసులాడాలని ఇంకెన్నో కోరికలుంటాయి

కానీ, నాకే సరదాలు లేకపోవటాన్కి కారణం రాజ్యం

రాజ్యం అందంగా ఉండదు. నలుపు పైగా ఎత్తు పళ్ళు ఆమెతో ఎక్కువసేపు మాట్లాడ్డానికి ఎవరూ యిష్టపడరు

అటువంటి అనాకారిని పెళ్ళి చేసుకోవటం నిజంగా నా దురదృష్టం నా నుదుటివ్రాత అలా వ్రాసి ఉంది మరి

రాజ్యం నల్లగావున్నా నేను చేసుకోక తప్పింది కాదు కారణం ఆమె నా మేనమామ కూతురు

పుట్టగానే నా పెళ్ళాం అనుకున్నార్ట

అదేం ఛాందసమో గాని - ఇవతలివారి అభిప్రాయాలు తెలుసుకోకుండా అపరిపక్వమైన వయస్సులో పెండ్లిళ్ళు నిర్ణయించటం పూర్వీకుల మూర్ఖత్వానికి మచ్చుతునక

మొదట ససేమిరా చేసుకోనన్నాను "రాజ్యం నా కోడలు కాకపోతే ఉరేసుకు ఛస్తాను అని బెదిరించి మరీ తాళి కట్టించింది అమ్మ

ఓ అందమైన అమ్మాయి వెంటపడి ప్రేమించి చూడగా బీచిలంట తిరిగి . సినిమాలకెళ్ళి ఆనక పెళ్ళి చేసుకోవాలన్న నాకోరిక. కలగానే మిగిలిపోయింది

గతం ఆలోచిస్తూ యిల్లు చేరాను.

గుమ్మంలోనే నిలుచుంది రాజ్యం

ఎత్తైన పళ్ళతో నవ్వుతూంది

చూపులు మరల్చాను అసహనంగా

దెయ్యంలా నా కోసం నిలబడ్డం ఎందుకూ! కసిరాను

'బావా! ఈరోజు మినర్వాలో దసరా బుల్లోడు వచ్చిందట వెళ్దాం రా బావా! ఆశగా అడిగింది రాజ్యం

'నీతో సినిమా ఒక్కటే తక్కువైపోయింది ఇప్పటికే నలుగురిలో తలెత్తుకోలేక పోతున్నాను ఏదో పెద్దల మాటని కొట్టేయలేక నిన్ను కట్టుకున్నాను కాని నిన్ను పట్టుకుని ఊళ్ళేలడానికి కాదు చిరాగ్గా చెప్పాను

రాజ్యం ముఖం దించుకుని లోపలికి వెళ్ళిపోయింది

రెండు నిముషాల తర్వాత బోర్నవిటా తెచ్చింది

అసంతృప్తిగానే త్రాగాను

నేనింట్లో ఉంటానన్న మాటేగాని ఉన్న ఆ క్షణంలోనే ఎంత విసుగ్గా గడపుతాను

ఛీ! జీవితం అంటే యింత చేదుగా . క్షణం క్షణం నిర్వీర్యంగా . నిర్లిప్తంగా ఉదాసీనంగా గడపవలసి వస్తుందనుకోలేదు

మృదు మధురమైన కలల్ని వాస్తవం చేసుకుని ముచ్చట్లన్నీ తృప్తిగా తీర్చుకోవాలని ఆవగింజంత ఆవేదనకి కూడా తావివ్వకూడదన్న నా తపన ఆశలు వ్యర్థమైపోయాయి

పుస్తకం తీసానన్నమాటేగాని . దృష్టి నిలవటంలేదు అక్షరాలు అలుక్కుపోయినట్లు అగుపిస్తున్నాయి

"బావా! ఏం అలా ఉన్నావు? ఒంట్లో బాగులేదా! తలనొప్పా! అమృతాంజనం తెచ్చి రాసేదా' అని నా వైపు చూస్తూ బాధగా అడిగింది

సీసా తేవడానికి వెళ్ళబోయింది

ఇదిగో నువ్వేం రాయనక్కర్లేదు కాని ఒక్క క్షణం మనశ్శాంతిగా ఉండనీ నన్ను! నా ఎదురుగా అలా దిష్టిబొమ్మలా నిలబడక లోపల పనులేమైనా వుంటే చూసుకో... అశాంతిగా అన్నాను

రాజ్యం వెళ్ళిపోయింది

పెద్దవాళ్ళ మూర్ఖత్వాలకీ చాదస్తాలకీ బలైపోయేది మావంటి వారే!

అనుక్షణం అయిష్టతనీ. . ఏహ్యతనీ ప్రదర్శించటం కన్నా - మధురానందాలకి తావెక్కడుంటుంది

నా మనస్సు అల్లిబిల్లిగా అయిపోయింది.

బయట కెళ్దామని మొహం కడుక్కుని బయలుదేరాను

నడుస్తున్నాను

ఆలోచిస్తున్నాను

సిగిరెట్ కొని వెల్గించాను

ఒరే! ప్రభాకరం!' పిలుపు విని తల త్రిప్పాను

స్కూటరుమీద కూర్చుని అల్లంత దూరానుంచి చేయి గాల్లో ఊపుతూ -పిలుస్తున్నాడు

వాడు చేతన్య

వాడ్ని సమీపించాను

'ఏంరా! చాలా కాలానికి కనిపించావు! గుంటూరులో వుండేవాడివి కదూ! ఎప్పుడొచ్చావిక్కడికి? అని ప్రశ్నిస్తూనే వాడిని నా చేతిలోకి తీసుకుని మెత్తగా నొక్కేను

"ఔను గుంటూరులో స్టేట్ బ్యాంకులో పని చేసేవాణ్ణి విద్యల నగరం కదా యిది గురజాడ వారి ఊరిది. ఆదిభట్ల నారాయణదాసుగారి పేరు ప్రఖ్యాతులు పరిమళించిన ప్రదేశమిది. నా కీ విజయనగరం అంటే ఎప్పటినుంచో సర్దా ఉంది అందుకే ట్రాన్స్ఫర్ చేయించుకున్నాను' అని విపులంగా చెప్పాడు చైతన్య

నవ్వి- పోన్లే మంచిపని చేసావు ప్రస్తుతం ఏ వీధిలో ఉంటున్నావు?" అడిగాను

"కొట్ల మాదప్పవారి వీధిలో ఉంటున్నాను. ఒరే పెళ్ళి కెలాగూ ఎగవేసావు కాని యింటికి రా మాశ్రీమతిని చూపిస్తాను టీ త్రాగి వెళ్దూ గాని ' అని నిష్ఠూరం ఆడుతూనే స్కూటర్‌మీ దెక్కించాడు

* * * *

"వీడు ప్రభాకరం నా స్నేహితుడు మేమిద్దరం కస్పా స్కూల్లో పదిదాకా చదివాం రచయిత కూడా" అని తన శ్రీమతికి నన్ను పరిచయం చేసాడు చైతన్య

అప్పుడే ఆమె పేరు దీపికని తెలిసింది

ఆమెను చూస్తుంటే రెప్ప వాల్చాలని కూడా లేదు

అప్సరసలా అద్భుత సౌందర్యంతో మిసమిసలాడే యవ్వన బిగితో అజంతా బొమ్మల్లే ఉందామే చదువుతో పాటు అందం కూడా తోడవటం గొప్పేననిపించింది

టీ యిచ్చినపుడు కూడా - పరాయి వాడి భార్యని అదే పనిగా చూట్టం సభ్యత కాదని తెలిసినా చూడాలనే అనిపించింది నాకు

ఎర్రటి పట్టు చరలో ఎంతో బాగుంది

టీ త్రాగి వెళ్లబోతూంటే "భోజనంచేసి వెళ్ళుగాని ఉండు" అవాడు.

తప్పింది కాదు

వాడి శ్రీమతి చేతి వద్దనతో సంతృప్తిగా తిన్నాను

"వస్తా మరీ" అరగంట దాటాక వెళ్లడానికి లేచాను.

"అప్పుడప్పుడు కలుస్తూండు!" చెప్పాడు వాడు

బయట కొచ్చిన మరుక్షణం చైతన్యమీద నా కసూయ ఏర్పడింది చైతన్య చాలా అదృష్టవంతుడు

అందాలరాశిని అర్ధాంగిగా పొందటానికి ఎన్ని జన్మలెత్తాలో .. అనుభవించటానికేనా యోగం ఉండాలి

అది నాకు లేదనే విచారం నన్ను నిలువునా నిరుత్సాహ పరచింది

నాకూ చైతన్యకి నక్కకీ - నాగలోకానికీ ఉన్నంత వ్యత్యాసం నాక్కనిపించింది

చీ తారుపోత పోసినట్లుండే రాజ్యంకీ వజ్రంలా అణువణువూ మెరిసిపోయే సుందర శిల్పంలాంటి దీపికకీ పరమాణువుకీ - పర్వతానికీ వుండే తేడా!!

అరె . ఆలోచనలో పడి వాడింట్లో కళ్ల జోడు వదిలేసి వచ్చేసానే!

వెనక్కి తిరిగి వెళ్లాను

తలుపు వేసేసి ఉంది

పిలుద్దామనుకున్నాను

కాని యింతలో దీపిక గొంతు పెద్దగా వినిపిస్తూంది

'నేనేం పని మనిషి ననుకున్నారా! గొప్ప కుటుంబంలోంచి వచ్చిన దాన్ని ఏనాడూ పనీ పాట చేసి ఎరుగను ఏదో పొందికగా మనిద్దరికీ వండుకోవటం వరకే పరిమితం నా పని అంతే తప్ప - అడ్డమైన వాళ్ళని అతిథులుగా పిలవటం . నాచేత వంటలక్కలా వండించటమూనా? నావల్ల కాదు బాబూ!.. ఇదిగో స్పష్టంగా చెబుతున్నా వినండి ఈ రోజు నుంచి ఎవర్ని విందులకీ వినోదాలకీ పిలవడాన్కి వీల్లేదు!' అని కోపంగా



వాదిస్తూంది దీపిక

'సారీ! దీపీ' ఈసారికి తప్పయిపోయింది నన్ను క్షమించు'" ప్రాధేయపడుతున్నాడు చైతన్య

అంతే! తలుపు గుద్దటాన్కి మనస్కరించలేదు

వెను తిరిగాను

రొడ్డుపైపడి మరల ఆలో చనలో పడ్డాను

ఎంతో అందంగా ఉండే దీపిక మనస్సు యింతటి అసహ్యకరమైందా!

స్నేహితుల్ని ఆదరించడాన్ని ఏవగించుకునే ఆమె సంస్కారం ఏపాటిదో బోధ పడిపోయింది నాకు

ఇందాకా - యిదే రోడ్డుపై - చైతన్య ఎంతో అదృష్టవంతుడని, అందమైన అర్ధాంగిని జీవితాంతం అనుభవించే భాగ్యం పొందగలిగాడని - అనుకున్నాను

కాని అందులో ఎంత అవివేకం వుందో యిప్పుడు నా హృదయానికి తోస్తుంది

సంస్కారంలేని సౌందర్యం తావిలేని పూవు లాంటిది

ఇంతకాలం అందాన్ని శారీరకంగానే పరిగణించే నా మనోనేత్రం ఈక్షణమే విచ్చుకుంది

గాఢ సుషుప్తిలో వున్న నన్ను వెన్ను తట్టి లేపింది

ఔను'' రాజ్యం నల్లగా కురూపే!

కాని - నేనెంత విసుక్కున్నా అసహ్యించుకున్నా చిదరించుకున్నా నాకేం కావాలోనని ప్రతి నిమిషం కనిపెట్టుకుని నే నెప్పుడొస్తానోనని నిరీక్షిస్తూ నేనేమన్నా కూడా మదిలో పెట్టుకోకుండా ఉండే రాజ్యం ఎంతటి ఉన్నతురాలు? సంస్కారవంతురాలు?

ఛీ! నేనే కుసంస్కారిని

నాకు వివేకం విచక్షణం లేవు.

నా అడుగులు గబ గబ పడుతున్నాయి

వాచీ చూసాను

ఎనిమిదిన్నరైంది

అయ్యో! ఈపాటికి రాజ్యం నా కోసం ఎదురుచూస్తుంటుంది ఆత్రంగాయిల్లు చేరాను

ఎదురుగా నిలుచో లేదు రాజ్యం

ఇంటికి తాళం వేసి ఉంది

రాజ్యంను యిప్పుడు చూడాలనిపిస్తుంది

గుండెల్లో చెప్పలేని అలజడి

ఇంతకాలం ఏదో తప్పు చేసిన భావం

మళ్ళీ వీధిలోకి వెళ్లబోతుంటే వాకిట్లోనే రాజ్యం ఎదురైంది

రాజ్యం!'" ఇంట్లోకి అడుగు పెట్టి పెట్టగానే నా బాహువుల్తో చుట్టేసాను గట్టిగా

బావా! నిన్న రాత్రి నీమీద ఏదో పీడ కల వచ్చింది అందుకే ఆంజనేయస్వామి గుడిలో - నీ పేరుమీద పూజ చేయించాను అడక్కుండా వెళ్ళినందుకు క్షమించు అని క్షమించమన్నట్టు చూసింది

ఆ క్షణంలో రాజ్యం నా కళ్లకు అత్యంత అందంగా కనిపించింది

"లేదు రాజ్యం! నువ్వే నన్ను క్షమించాలి యింతకాలం నిన్ను అనవసరంగా బాధ పెట్టాను నిన్ను అర్థం చేసుకోలేకపోయేను ఇక నుంచి నువ్వే నా దేవతవి' అని స్పష్టంగా నిండుగా హృదయ పూర్వకంగా నేను పలికేసరికి - ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ కళ్లార్పకుండా చూస్తూండి-పోయింది

నా అర్ధాంగి రాజ్యం నా వైపు'' □

## కృత్రిమ సృష్టి

పుట్ట గొడుగులను కృత్రిమ వాతావరణంలో సృష్టించే పద్ధతిని పశ్చిమ జర్మని శాస్త్రవేత్తలు రూపొందించారు ఒక పొడువైన ప్లాస్టిక్ గొట్టాన్ని తీసుకొని దానిని గడ్డితో నింపుతారు దీనిలోనికి పుట్టగొడుగుల జన్యుకణాలను ఎక్కిస్తారు తగినంత వేడిని కలుగజేస్తే, పుట్టగొడుగులు ఇందులో నుంచి పుట్టు కొస్తాయి ఈ పద్ధతిలో శీతాకాలంలో కూడా పుట్టగొడుగులను సృష్టించవచ్చు ఈ రకంగా కృత్రిమ సృష్టి చేసే కేంద్రాలను సస్యగృహాలు అని అంటారు ఇటీవల న్యూరిం బర్గ్‌లో జరిగిన ఒక ప్రదర్శనలో దీనిని ప్రదర్శించారు

(గ్లోబల్)

## ఇప్పుడు తెలిసింది

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

# కోరిక తీరే వేళ

## రాణి మాలిని

గులాబీరేకుల సౌకుమార్యం - జాజిమొగ్గల లావణ్యం కలబోస్తే ఆమె సునీత

సునీత వయస్సు పదిహేడు సంవత్సరాలు ఇంటర్ రెండుసార్లు డింకీలు కొట్టేసి ఆపైన శ్రమపడటం ఇంట్లో వాళ్ళని ఇబ్బంది పెట్టటం ఇష్టం లేక ఎంచక్కా చదువుకు గుడ్‌బై కొట్టేసి తనకెంతో ఇష్టమైన కథలు నవలలు చదవటంలో లీనమైపోయింది

హఠాత్తుగా సునీత మనసులో కథ రాయాలన్న కోరిక కలిగింది దొరికిన పుస్తకమల్లా చదివేస్తూ అందరినీ నవ్విస్తూ - ఉడికిస్తూ ఉషారుగా తిరిగే ఆ అమ్మాయి తీగ తెగిన వీణలా మూగబోయింది

తమ్ముళ్ళు - చెలెళ్ళు "అక్కా" అంటూ దగ్గర చేరినా విసుక్కోసాగింది ఎన్నడూ లేనిది అస్మిమితంగా ఫీలవుతూ ఒంటరిగా గడపసాగింది

తన చుట్టూ ఏం జరుగుతుందో గ్రహించే స్థితిలో లేదు సునీత మనసు

పెద్దలు చూశారు అమ్మాయి పరిస్థితి గమనించి గాభరా చెందారు పెళ్ళి చేసేస్తే తిక్క తిన్నగా వస్తుందనుకున్నారు గుసగుసలాడారు హడావిడి పడ్డారు ఫలితం వెంటనే పెళ్ళికొడుకు కోసం వల వేసి గాలించారు వాళ్ళు వేసిన ఎరకి ఓ అందగాడు - బుద్ధిమంతుడైన యువకుడు చిక్కాడు పెళ్ళి చూపులు ఏర్పాటు చేశారు

విషయం విన్న సునీత నివ్వెరపడింది 'ఇన్ని రోజులుగా లేనిది ఇంతలో నే ఏమిటీ హడావిడి? పెళ్ళి చేసే దాకా ఈ పెద్దవాళ్ళకి నిద్ర పట్టదేమో'' మనసులో నే విసుక్కుంది

పెళ్ళి చూపులు జరిగాయి పిల్ల నచ్చింది పిల్ల తండ్రి ఇచ్చే కట్నమూ నచ్చిందేమో వెంటనే సునీత పెళ్ళి నిశ్చయమయింది 'ఇప్పుడే పెళ్ళేమిటి?' అని గొణిగిన సునీత, చూపుల తరువాత తన నిర్ణయాన్ని మార్చుకుని పెళ్ళి గురించి - కాబోయే వరుడి గురించి యోచన చేస్తూ మధుర స్వప్నాలలో తేలిపోసాగింది

పెళ్ళి జరిగిపోయింది పెద్దలు తేలిగ్గా గాలి పీల్చుకున్నారు కొండంత బరువు గుండెల మీద నుంచి దిగిపోయినట్టు

భర్తతో షికార్లు- సినిమాలు ఆ తరువాత ముచ్చటైన కబుర్ల కాలక్షేపం చిలిపి తగాదాలతో సంవత్సరం గడిపేసింది సునీత

తాత్కాలికంగా నిద్రించిన సునీత మనసులోని కోరిక తిరిగి నిద్ర లేచింది

ఏదో ఆరాటం - తపన మనసుని స్థిమితంగా ఉండనివ్వటం లేదు ఏమైనా సరే తన మనసులో ని భావాలకి అక్షరరూపం ఇవ్వాలి అనుకుంటూండగానే రోజులు దొర్లిపోతున్నాయి

కర్తవ్య నిర్వహణలో మునిగి తేలుతున్నా ఏకాగ్రత చూపలేకపోతుంది

మధ్యాహ్నం భోజనం ముగించి నిద్రపోయే కార్యక్రమం వాయిదా వేసుకుని 'ఏమయినా సరే ఈ రోజు కథ రాసి తీరాలి'' అని తనలో తనే ప్రతిజ్ఞ చేసుకునే సమయంలో అత్తగారి కేక సుడిగాలిలా దూసుకు వచ్చి ఆమె తీర్మానాన్ని గాలిలో కలిపేసింది

అమ్మాయ్! నిద్ర పట్టటం లేదు బ్రహ్మంగారి చరిత్ర రెండు పేజీలు చదివి వినిపించవే!''

ఆవేదనని అణగద్రొక్కి తప్పనిసరిగా పెదవులపై చిరునవ్వుతో పుస్తకం తెరచి కూర్చుంది సునీత

పేపరు వెయిట్ కింద రెపరెపలాడుతున్న తెల్లని కాగితాలు ఆమె మనసులో ని ఆశ నిరాశల్లా ఉన్నాయి

అత్తగారికి కాలజ్ఞానం చదివి వినిపించి తేలిగ్గా నిట్టూర్చేంతలో గాలితో పాటు రివ్వున దూసుకు వచ్చింది మామగారి పిలుపు సునీతా! అంటూ

ముందు గది దాటి వరండాలోకి వెళ్ళింది కోడలిని చూసి - "ఈ రోజు పేపరు చదవలేదమ్మా? ఏదో పెద్దవాణ్ణి చూపు ఆనక నిన్ను ఇబ్బంది పెట్టాల్సి వస్తుంది ఎప్పుడూ మంచంలో పడి ఉండలేక ప్రాణం గిలగిలలాడుతుంది '' రిటైర్ అయ్యి ఇంట్లో ఉన్న ఆయన మధ్య మధ్య తను ఉద్యోగం చేసే రోజుల్లో కబుర్లు చెబుతూ పేపరు వింటారు

అంత పెద్దాయన పేపరు వినాలన్న కోరికతో తనని అర్థించే సరికి సునీత మనసు ద్రవించిపోయింది

మర్చిపోయాను మామగారూ! అంటూ ముఖ్యమైన వార్తలు చదివి వినిపించింది

మన పనులు పూర్తికాలేదని కాలం ఆగదుగా!

కాఫీల టైము అయ్యేది అవి పూర్తిచేసి పని మనిషికి అంట్లు వేసి చిన్న చిన్న పనులు చేసేసరికి సాయంత్రం అయ్యేది వంటపని ముగించి కలం తాకబోయేంతలో మా వదిన బంగారు తల్లి బొమ్మలు వేయటంలో ఆమె తర్వాతే ఎవరయినా! కాని చిత్రకారిణి అవ్వాలన్న కోరిక మా వదినలో లేకపోబట్టి పెన్సిల్ పుచ్చుకోవటం చేతకాని దద్దమ్మలు కూడా ప్రసిద్ధులై పోతున్నారు' అంటూ ఆడపడుచు కాంతి ప్రవేశించింది

"ఆపవోయ్ నీ కోతలు నీ పనేమిటో చెప్పు అంటూ నవ్వుతూ ఆమె నోరు మూయించి మరదలు అడిగిన పని పూర్తి చేస్తుంది

భర్తకి ఆఫీసునుంచి రాగానే టీ త్రాగటం అలవాటని టీ పెట్టి ఫ్లాస్కులో పోసి తన స్నానం ముగించి తీరుబడిగా జడ అల్లుకుంటూ కూర్చుంది సునీత

ఇంతలో రానే వచ్చాడు ఆమె మరిది మనోజ్ కుమార్ సీనియర్ ఇంటర్ చదువు తున్నాడతను కాంతి జూనియర్ ఇంటర్ చదువుతూంది ఇద్దరికీ ఒక్కమాటలో కూడా అభిప్రాయాలు కలవ్వు

'ప్లీజ్ వదినా కాసేపు షటిల్ ఆడవూ ! ప్లీజ్ ప్రాక్టీసు లేకపోతే ఫ్రెండ్స్ దగ్గర షేమ్ అవుతాను అంటూ బ్రతిమాలసాగాడు

ప్రాక్టీసు చేస్తే ఈయనగారు అంతర్జాతీయ క్రీడా కారుడు అయిపోతాడు కామోసు' కిసుక్కున నవ్వింది కాంతి

బ్యాటు పుచ్చుకుని చెల్లెలి మీదకు వెళ్ళాడు మనోజ్ తంతాను అంటూ

సునీత ఇద్దరినీ విడదీసి ఆటలోకి దిగింది

ఇంటి ముందు ఉన్న ఖాళీ స్థలంలో కోర్టుగీసి నెట్ కట్టాడు మనోజ్ అప్పటికే

రెండు ఆటలు పూర్తయ్యాయి రెండు సార్లు సునీత ఓడిపోయింది సమయం ఏడుగంట లయింది సరిగ్గా అప్పుడు వచ్చాడు ఆ ఇంటి కుటుంబ సభ్యులలో ముఖ్యుడు సునీత మానస చోరుడు మదన్ మోహన్

తెల్లని గ్లాస్కోచీర చుట్టూ నల్లని బోర్డర్, నుదుట దోసగింజ ఆకారంలో దిద్దిన నలుపు సింగార్ తిలకం గిరజాలు తిరిగిన నల్లని కురుల్లో విరిసిన మల్లెలు మెడలో మెరుస్తున్న నల్ల పూసలు చేతిలో బ్యాటు నుదుట ముత్యాల్లా నిలచిన స్వేదబిందువులు పెదవులపై చిరునవ్వుతో అపరంజి బొమ్మలా ఉన్న సునీతని తమకంగా చూడసాగాడు మదన్ మోహన్

లోనికి పదండి టీ తీసుకుని స్నానం చేద్దురు అంటూ బ్యాటు వదిలేసి అన్న వెంట వెళుతున్న వదిన వైపు నిరుత్సాహంగా చూశాడు మనోజ్

భోజనాలు ముగించి వంటగది సర్ది పడక చేరే సరికి పదయింది సునీతకు

కాంతి- మనోజ్ చదువుకుంటున్నారు అత్తమామలు నిద్రపోతున్నారు

సునీత గదిలోకి వచ్చేసరికి మదన్ ఉదయం పేపరు చూస్తున్నాడు దిండ్లు గోడకానించి వాలుగా పడుకుని సునీత కూడా మంచం మీదకూర్చుని వీక్లీ తీసి పేజీలు తిప్పసాగింది పేపరు మడిచి పక్కన పడేసి-

ఏమిటోయ్ మౌనంగా ఉన్నావ్? కాసేపు ఏమైనా కబుర్లు చెప్పు అన్నాడు

"చెప్పుకోదగ్గ కబుర్లేం లేవు'! పేజీలు తిప్పుతూ జవాబిచ్చింది

ఒసెకను ఆమె వైపు పరిశీలనగా చూసి "ఏది' ఆ వీక్లీ ఇలాఇవ్వు'' అని అడిగి తీసుకుని దిండుకింద దాచేసి చిలిపి నవ్వు విసిరాడు మదన్

"ఏమిటండీ" విరుకోపంగా చూసింది సునీత

'లేకపోతే ఏమిటండీ'' సునీత ననుకరించి అని చిన్నగా తలపై మొట్టి "నేను ఆఫీసులో ఉన్నప్పుడు చదువు కోవోయ్ పుస్తకాలు నేను ఎదురుగా ఉండగా పుస్తకాలతో పనేమిటి నీకు' కనుబొమలెగరేస్తూ కొంటిగా నవ్వాడు

"ఏం చెయ్యా మంటారు" బుగ్గపై వేలుంచుకుని మెల్లగా అడిగింది

'నన్ను చూడవోయ్ అంటూ దగ్గరకు తీసుకుని తల నిమురుతూ

"ఏమిటీ రోజు డల్‌గా ఉన్నావు?' లాలనగా అడిగాడు మదన్

బాగానే ఉన్నాను దబాయించింది సునీత

పది నిముషాల అనంతరం మదన్ కళ్ళు మూసుకుని పడుకున్నాడు

సునీత చప్పుడు కాకుండా లేచింది టేబిల్ ల్యాంప్ వేసి నిశ్శబ్దంగా పేపర్సు తీ సింది పెన్ను కాప్ తీసి ఓం" అని వ్రాసిందో లేదో- పక్కన భార్య పడుకున్న జాడ లేక ఏమైందా అని వెల్లకిలా తిరిగిన మదన్ ఆమె చేసే పనులో క్షణం గమనించి అర్థంకాక-

'ఏమిటోయ్ అది ' అన్నాడు తలకింద చేతులుంచుకుని ఆమెనే సూటిగా చూస్తూ

"ఓ...శ్శే ఏం లేదండి" తడబడింది సునీత

మనసులోని భావాలకి అక్షర రూపం ఇవ్వాలని ఆమె ప్రయత్నం కాని ఎప్పటికప్పుడు ఆదిలోనే హంసపాదు

ఆమె తడబాటు అతనిలో అనుమానాన్ని కలిగించింది

ఏమి లేనప్పుడు ఆ కంగారెందుకు'' అంటూ లేచి వచ్చి ఆమె వెనుక నిల్చున్నాడు

అప్రయత్నంగా ఆమె చేతిలోని పెన్ను జారి పేపరుపై పడింది తెల్లని పేపరు పై సిరామచ్చ క్షణక్షణం సునీత మనసులోని నిరాశలా పెరిగిపో సాగింది

కొంపతీసి కథగాని వ్రాస్తున్నావా' భయపడుతున్నట్టు మొహం పెట్టి అడిగాడు మదన్

సునీత మౌనంగా నేల చూపులు చూస్తుండి పోయింది

నీతా డియర్' ఏమిటీ పిచ్చితనం? హాయిగా లైఫ్ ఎంజాయ్ చెయ్యక ఏమిటీ పరాకు అయినా ఎందుకమ్మా మల్లెపూవు లాంటి తెల్లని పేపరులను ఖరాబు చెయ్యటం' కథలు రాయటం పకోడీలు చెయ్యట మంత తేలికనుకున్నావా' అందరికీ ఆ అదృష్టం దొరకదు పూర్వజన్మ సుకృతం ఉండాలి కళాకారిణిగా రాణించాలంటే' ఆమె తలపై వేళ్ళతో మృదువుగా రాస్తూ చెప్పాడు

సునీత ముఖంలో భావాలను గమనిస్తే అతనలా అనగలిగేవాడు కాదు

వాలిన ఆమె కనురెప్పలు నీటితో నిండి పోయాయి

బరువెక్కిన ఆమె హృదయంలోని ఆవేదన ఉప్పెనలా ముంచుకొచ్చింది

ఆ రాత్రి ఆమె కన్నీటికి దిండు ముద్దయింది

★ ★ ★ ★ ★

కొద్ది మార్పులు తప్ప ఇంచుమించుగా సునీత దినచర్య అలానే సాగిపోతోంది రోజులు గడిచి పోతున్నాయి ఎప్పటిలాగే వచ్చిన మార్పల్లా సునీతలోనే

ప్రొడక్షన్ నెంబర్ వన్ తయార్ ఆ పైన విశ్రాంతే కరువైంది పాప ఆటపాటల్లో రోజులు నిముషాల్లా దొర్లి పోతున్నాయి

పాపకి రెండేళ్ళు నిండాయి నెంబర్ టూ తయార్ ఫులుస్టాప్ పెట్టాలనుకున్న సునీత మాట ఎవరూ వినిపించు కోలేదు 'అబ్బాయి ఒక్కడే అయినా పర్వాలేదు అమ్మాయి లిద్దరు ఉండి తీరాలి ఒకరి కొకరు అండదండగా ఉంటారు అంటూ ఆమె మాటలు కొట్టి పారేశారు

మళ్ళీ రెండేళ్ళకి నెంబర్ త్రీ రంగప్రవేశం చెయ్యక తప్పలేదు అందరూ కోరుకున్నట్టు అమ్మాయే పుట్టింది



ఇద్దరు పాపలు ఒకబాబు వారికి పాలు, బిస్కెట్లు, హాస్పిటల్ ఫీజులు, బట్టలు ఖర్చులు పెరిగిపోయాయి కాంతికి పెళ్ళి చేయటం, మనోజ్ చదువుకుంటానని పట్టుబడితే పోస్టు గ్రాడ్యుయేషన్‌కి పంపించారు మదన్‌మోహన్ జీతం కుటుంబం పెరిగేసరికి సరిపోవటంలేదు తండ్రికి వచ్చే పెన్షన్ కొద్దిపాటి ఆస్తి కాంతి పెళ్ళికి ఖర్చయిపోయింది

పిల్లలు కాన్వెంటులో చేరారు మనోజ్ చదువు పూర్తయింది. అతనికి పెళ్ళి చేశారు వాళ్ళ మామగారు ఉద్యోగం ఇప్పిస్తాననేసరికి వేరు కాపురంపెట్టి ఇల్లు వదిలాడు.

అతని చదువుకు చేసిన అప్పు మాత్రం మిగిలింది మదన్‌కి.

బరువు బాధ్యతలు రెట్టింపు అయ్యాయి పిల్లలు పెరగటం వారి చదువులు సక్రమంగా సాగేలా చూడటం ఊపిరి సలపనంత పనైంది సునీతకు

ఓ పక్క ఆర్థిక ఇబ్బందులు మానసికంగా కృంగదీస్తున్నాయి

మామగారు పోయారు. అత్తగారు పిల్లలందరి దగ్గరకీ తిరుగుతూ ఉంటుంది

కేలండర్‌లు చక చకా మారిపోయాయి పెద్దమ్మాయి సుధ ఇంటర్ ఫెయిల్ అయింది మధు పాలిటెక్నిక్‌లో చేరాడు లత ఫస్ట్ ఇంటర్‌లోకి వచ్చింది. సుధకు చదువుమీద ఆసక్తి లేదని గ్రహించి పెళ్ళి చేసేశారు అమ్మాయిని కాపురానికి పంపి గుండెల నిండుగా గాలిపీల్చుకుంది సునీత

ఇన్నేళ్ళ కాలంలో సునీత ఎన్నోసార్లు కథరాయాలని ప్రయత్నించి విఫలమయింది. అవకాశం దొరికినప్పుడు కాగితాలు ఖరాబు చెయ్యటం తప్ప మనసులోని భావాలకి సరైన భాష కుదిరేదికాదు మనస్సు స్పందించి రాయాలన్న తపన కలిగినప్పుడు అవకాశం చిక్కేదికాదు

ఇప్పుడు సునీత వయస్సు ముప్ఫైఐదు సంవత్సరాలు

వెంకటగిరి చీర చిన్నముడి చేతులనిండుగా ఎర్రని గాజులు, మెడలో నల్లపూసలు, నుదుట పెద్దబొట్టు వయసుకు తగ్గ అలంకరణతో

# కోరిక తీరే వేళ

గులాబీల సౌకుమార్యం కరిగిపోయి కాస్త ఒళ్ళుచేసి ప్రౌఢలా ఉంది సునీత

మదన్‌కి ప్రమోషన్ రావటంతో జీతం పెరిగింది కుటుంబ పరిస్థితులు కాస్త మెరుగుపడ్డాయి.

సునీత కాస్త తీరుబడిగా ఉండటం గమనించి మనసులో పీఠంవేసిన కోరిక రెక్కలు విప్పుకుంది

ఎందుకోయ్ పేపర్లు ఖరాబు చేస్తావు ?'

"రచనలు చెయ్యటమంటే అనపకాయ ఆవపెట్టి వండటమనుకున్నావా! అదృష్టం ఉండాలోయ్!" నీవల్లేం అవుతుంది కథరాయటం అన్నట్టు భర్త హాస్యానికిఅన్నా ఆ మాటలు పదేపదే చెవిలో హోరెత్తిస్తూ ఆమె మనసుని బాధించసాగాయి

తను వ్రాసిన కథ అచ్చయితే ఆయన చూసి ఆశ్చర్యపోయి పర్వాలేదు నువ్వూ కథలు రాయగలవు నేనూహించినట్టు సామాన్యురాలివి కాదు అని ప్రశంసించాలి

ఎలాగయితేనేం! అహోరాత్రులు ఆలోచనలతో శ్రమించి కథ పూర్తి చేసింది సునీత

ఒకటికి నాలుగుసార్లు చదువుకుని తృప్తిగా నిట్టూర్చింది చక్కగా ఫెయిర్ చేసి కవరులో పెట్టి స్టాంపులంటించి అడ్రస్ వ్రాసింది

'కథ ప్రింట్ అయ్యేవరకూ భర్తకు తెలియకూడదు కదా!' అని కాలేజికి వెళుతున్న లతకిచ్చి పోస్ట్ చెయ్యమని చెప్పింది

రెండు నెలలు గడిచిపోయాయి సునీత కళ్ళు ఆరాటంతో నిరీక్షించేవి 'పోస్ట్' అన్న పిలుపు కోసం చెవులు నిక్కబొడుచుకుని ఆలకించేది

'ఉహూ' ఫలితం శూన్యం

ఆ రోజు-

సాయంత్రం వంట పనిలో ఉంది సునీత

'అమ్మా! అమ్మా!' పరుగున వచ్చింది సునీత

చేతిలో పుస్తకం చూపించి- అమ్మా ఇది చూడు అని లత అనటం వరకే వినిపించింది

ఆనంద ఉప్పొంగుతుండగా నిల్చునే శక్తిలేని దానిలా కూర్చుండిపోయింది

'జంటగులాబీలు' తనకథే మొదటి నుంచి చివరివరకూ ఏకాగ్రతతో ఆనందంతో తృప్తితీరా చదివింది

ఆవేశం తగ్గి ఆలోచన కలిగేసరికి పేరుకోసం ఆమె నేత్రద్వయం ఆరాటంతో అన్వేషించాయి 'ఎ లత' అన్న అక్షరాలు మసక మసకగా కనిపించాయి అది తను పంపిన వీక్లీ పేరు కాదు

'కాలేజీ మేగజైను'

తలెత్తి కూతురివైపు చూసింది

చేతిలో మిఠాయి కాకెత్తుకుపోతే పసివాడు చూసే చూపులా దీనంగా ఉందామె మోము

అమ్మా అసలు ఏం జరిగిందంటే- మేగజైనుకి కథలు- కవితలు ఇవ్వాలనుకున్నవారు ఫలాన డేట్‌లోగా ఇవ్వమని నోటీస్ వచ్చింది

నేను కథ వ్రాయలేనని బెట్ కట్టారు మా ఫ్రెండ్స్, అప్పటికి ఓ చిన్న కథ వ్రాయలేనా అన్న ధీమాతో వ్రాస్తానని ప్రతిజ్ఞ చేశాను వారిని ఓడించటానికైనా కథ వ్రాయాలని ప్రయత్నించి విఫలమయ్యాను నువ్విచ్చిన కవరు పోస్ట్ చెయ్యటం మర్చిపోయాను నోట్స్‌లో పెట్టి

నా ఫ్రెండ్స్ కవరు తీయటం ఆలోచనలలో ఉన్న నేను గమనించలేదు సునీత ఎవరే! నువ్వు ఆ పేరుతో కథలు వ్రాస్తావా! అంటూ వాళ్ళ చుట్టూ చేరి ఆరాగా అడగటంతో ఆ పరిస్థితి నుంచి తప్పించుకోవడానికి, నేనే సునీత పేరున పత్రికలకు కథలు పంపుతానని చెప్పాను వాళ్ళ వదిలిపెడితే ఆ కవరు పోస్ట్ చేద్దామనుకున్నాను కానీ వాళ్ళు అంతటితో వదిలిపెట్టక లెక్చరర్ దగ్గరికి తీసుకువెళ్ళి ఇచ్చారు అంత కథ నడిచాక వెనుకంజ వెయ్యలేక కన్న తల్లివి అర్థం చేసుకుంటావన్న ఆశతో నీ కథను నా పేరుతో మేగజైనుకి ఇచ్చాను నన్ను క్షమించమ్మా!' తల్లి పాదాలపై చేతులుంచి కన్నీరు కార్చింది లత

సునీత కళ్ళ నుంచి కారుతున్న కన్నీరు ఆమె గుండెల్లోని జ్వాలను చల్లార్చుటానికన్నట్టు గుండెల మీదకి జారి ఇంకిపోతున్నాయి □

# సార్వత్రిక విశ్వవిద్యాలయం ఆశయాలు డాక్టర్ నారాయణ రెడ్డితో గోష్ఠి

జౌను సార్వత్రిక విశ్వవిద్యాలయం ఎందరికో వరప్రసాదం వంటిది- అన్నారు సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ సి నారాయణ రెడ్డి

అశోక్‌నగర్‌లోని ముచ్చటైన మేడమీది గదిలో ఆయనను కలుసుకొన్నాను గది దీర్ఘ చతురస్రాకారంగా వుంది మూడు సోఫాలు ఒకపక్క గోడకున్న అద్దాల అరలలో ఆయనకు వివిధ సంస్థలు బహూకరించిన ఫలకాలు, కప్పులు, పటాలు 250 ఉన్నాయి-జౌను ఎంచాను గోడలకు దాదాపు 20 సన్మాన పత్రాలు వ్రేలాడుతున్నాయి

ఉపాహారం తీసుకొన్న తర్వాత ప్రారంభిద్దాము- అన్నారు ఉపాహారం తీసుకుంటూనే తమ విశ్వవిద్యాలయం ఆశయాలు, కార్యక్రమాలు చెప్పడం ప్రారంభించారు ఆర్థిక కారణాలవల్ల చిన్ననాడే చదువు మానివేసిన వారు, కొంత వరకు చదివి పైచదువులు చదువుకుందామనుకొనే వారూ ముఖ్యంగా ఏవో డిగ్రీలు పొంది గౌరవం సంపాదించుకుందామనే మహిళలూ, కార్మికులూ ఉద్యోగాలు చేస్తూ ఉన్నతికోరుకునే వారూ ఈ విశ్వ విద్యాలయం నుంచి ఎంతో ప్రయోజనం పొందవచ్చు కరెస్పాండెన్స్ కోర్సులు దేశంలో ఏమారు మూలలో వున్న వారికైనా లాభిస్తుంది ప్రస్తుతం బి ఎ, బి ఎస్‌సి, కోర్సులు ప్రారంభించాము.

మధ్యలో ఆపి మీరు ఎంత వరకు చదివారు?- అనడిగారు చెప్పాను ఇంటర్ చదివినవారు బి ఎ కు సరాసరి వెళ్ళవచ్చు ఏచదువూ చదువనప్పుడు ఎంట్రన్స్ పరీక్ష వుంటుంది దానికి కూర్చొంది సరాసరి బి ఎ, తర్వాత ఎం ఎ. కావచ్చు. వచ్చే విద్యా సంవత్సరం నుంచి ఎం ఎ, ఎం కాం., ఎం. ఫిల్, పి. హెచ్‌డిలు ప్రారంభిస్తాము. మీరు పి హెచ్ డి. అయితే ఫ్లాష్ చేస్తాము పత్రికలలో - అన్నారు.

బోధన ఎలాగా?-అన్నాను. ప్రతి జిల్లా కేంద్రాలలోను అధ్యయన కేంద్రాలు ఏర్పాటు చేశాము స్థానిక కళాశాలలలో పార్ట్‌టైం లెక్చరర్లను నియమించాము వారు ఆయా ప్రాంతాల విద్యార్థులకు వారాని కొకసారి గాని, తరచుగా గాని సందేహాలు తీర్చుతుంటారు వారందరికీ ఒక కో ఆర్డినేటర్ వుంటారు. అతడు ఆయాప్రాంతాల కోర్సులను, విద్యార్థులను క్రమబద్ధం చేస్తాడు- అన్నారు

ఇతర దేశాలలో ఇలాటి విశ్వ విద్యాలయాలు



ఉన్నాయి కదా వాటికి, దీనికి భేద మేమి?- అనడిగాను ఇతర దేశాలలో అంటే, బ్రిటన్, థాయిలాండ్, శ్రీలంక, పాకిస్తాన్‌లలో ఇలాటి విశ్వ విద్యాలయాలున్నాయి ముఖ్యంగా బ్రిటన్‌లో ఈ పద్ధతి చాల వ్యాప్తిలో వుంది. బ్రిటన్‌లో పిల్లలను చాల మంది తలిదండ్రులు సెకెండరి విద్య చదివించి వదలిపెడుతారు. పిల్లలు తమ పొట్ట తాము పోసుకుంటూ డబ్బుసేకరించి చదువు కుంటారు కార్మికులు కూడ చాలమంది అలాగే చదువు కొని బాగు పడుతారు మనదేశంలో తొలిసారిగా ఏర్పడిన ఈ విశ్వ విద్యాలయం విశిష్టత ఏదేశం వారైనా ఏ వయస్సు వారైనా సరాసరి ఏ పరీక్ష కయినా వెళ్ళవచ్చు మనవారు బ్రిటన్‌లో పరీక్షకు వెళ్ళడం సులభ సాధ్యం కాదుకదా! ఈ విశ్వ విద్యాలయం ఇతర రాష్ట్రాలలోను- తమిళనాడులో కర్నాటకలో- అధ్యయన కేంద్రాలు ఏర్పాటు చేసింది క్రమంగా ఇతర రాష్ట్రాలలోను కేంద్రాలు ఏర్పాటు చేస్తుంది- అన్నారు.

ఇప్పుడు హైదరాబాద్ రేడియో బి. స్టేషను నుంచి 30 నిమిషాలు మాత్రమే మీ విశ్వవిద్యాలయం పాఠాలు ప్రసారం చేస్తున్నారు ఆ సమయం చాలదే?- అన్నాను. అవును. రేడియోలో మరికొంత సమయం కేటాయించ వలసిందని, దూరదర్శన్‌లోను అవకాశ మివ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరాము కేంద్ర ప్రభుత్వం- ఈ విశ్వవిద్యాలయం దేశంలోనే మొట్ట మొదటిది గనుక- అంగీకరిస్తుందనే విశ్వసిస్తున్నాను

అంతేకాక వీడియో పాఠాలను ఎక్కువగా తయారు చేయడానికి ప్రయత్నిస్తున్నాము దీనికోసం తగిన రికార్డింగు స్టూడియోను త్వరలోనే సంపాదింప నున్నాము ఇంతవరకు 50 పాఠాల వీడియో టేపు లున్నాయి ప్రపంచ జ్ఞానం మీద, వివిధ విషయాల మీద బి బి సి నుంచి దాదాపు 60 కేసెట్లు సంపాదించాము వీటిని అధ్యయన కేంద్రాలకు పంపుతాము- అన్నారు

ఈ అద్యయన కేంద్రాలు జిల్లా కేంద్రాలలో వుంటే చాలదు జిల్లా కేంద్రాలు కాని పెద్ద పట్టణాలలోను - ఉదాహరణకు విజయవాడ వంటి వాటిలోను- వుండడం సమంజసం కాదా?- అన్నాను నిజమే గోదావరిఖని, కావలి, ఇల్లెందు, మదనపల్లె, ఆదోని పట్టణాలవారు కేంద్రాలు కావాలనికోరారు సాధ్యమయిన స్థలాలలో కేంద్రాలు ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తాము కనీసం 300 మంది విద్యార్థులున్న చోట ఒక అధ్యయన కేంద్రం ఏర్పాటు చేయడానికి అవకాశం వుంటుంది ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్‌లో 30 కేంద్రాలున్నాయి వీటిలో తొమ్మిది జంటనగరాలలో వున్నాయి- అన్నారు

మీ విశ్వవిద్యాలయం కోర్సులు ఇతర విశ్వవిద్యాలయాల కోర్సులకు ప్రతి రూపాలు కావడం లేదుకదా!- అన్నాను సాధ్య మైనంత వరకు అలా కాకుండా చూస్తున్నాము కోర్సులు ప్రయోజనాత్మకంగాను, సంఘ శ్రేయస్సాధకంగాను వుండేట్టు చూస్తున్నాము డిగ్రీ, స్నాతకోత్తరణ కోర్సులు ఎంతో సరళంగా వుంటాయి అభ్యర్థి అభిరుచికి తగినట్టుగా, శాస్త్ర, శాస్త్రేతర, వాణిజ్య విషయాలు కలగలుపుగా నేర్చుకోవచ్చు. ఈ విశ్వ విద్యాలయం పబ్లిక్ అక్కౌంట్స్ డిప్లొమాకోర్సును కేంద్ర, ఆంధ్రప్రభుత్వాలు గుర్తించాయి-అన్నారు

మీ విశ్వ విద్యాలయం విద్యార్థులు ఎప్పుడు తొలి పట్టాలు పుచ్చుకుంటారు?- అనడిగాను వచ్చే జూనుకు తొలి పట్టభద్రులు పట్టాలు పుచ్చుకుంటారు ఈ విశ్వవిద్యాలయానికి మూడు సంవత్సరాల క్రితం రాష్ట్రపతి జ్ఞాని జైల్‌సింగ్ ప్రారంభోత్సవం చేశారు- అన్నారు.

మీరు ప్రారంభించే కొత్త కోర్సులలో విశిష్ట మైనవి చెబుతారా?- అనడిగాను ఇప్పుడు తెలుగు అధికార భాష అయింది గనుక, అనువాదం చాల అవసరం అందువల్ల అనువాదం గ్రామీణాభివృద్ధి, జర్నలిజం కోర్సులు

# హైదరాబాద్ నోట్‌బుక్

ప్రారంభించదలచాము. అనువాదం, జర్నలిజం కోర్సుల విషయంలో పత్రికారచయితల సహకారం అవసరమౌతుంది. అనువాదం అన్నప్పుడు హిందీ లింక్ భాష గనుక దాని అనువాదమూ ప్రసక్తమవుతుంది కాని, దాని విషయం ఆలోచించలేదు. ప్రస్తుతానికి తెలుగు - ఇంగ్లీషు, ఇంగ్లీషు తెలుగు అనువాదంలో మాత్రం కోర్సులు ప్రారంభిస్తాము ప్రస్తుతం ప్రపంచమంతటా వార్తలు ఆంగ్లంలోనే ప్రచారమవుతున్నాయి గనుక, ఆయా భాషల్లో టెలిప్రింటర్లు వచ్చే వరకు అనువాదాలు తప్పవు అందుకోసమే అనువాదాల కోర్సు ప్రారంభిస్తాము. దానితో ప్రభుత్వోద్యోగులు తెలుగులో చక్కగా డ్రాఫ్టు చేయగలుగుతారు- అన్నారు

ఈ పథకాలలోనే కాదు. ఏమంచి విషయానికైనా పత్రికారచయితల, పత్రికల సహకారం మీకు ఎప్పుడూ వుంటుంది మంచిని పెంచడానికే కదా పత్రికలు వున్నాయి- అన్నాను

మరొక విచిత్రమైన సంగతి మీకు చెప్పాలి- అన్నారు ఆయన ఏమిటిది?- అని కుతూహలంతో ప్రశ్నించాను చిన్ననాడు చదివే సౌకర్యాలు లేని వారికి మా విశ్వవిద్యాలయం కల్పవృక్షమన్నానే దానికొక ఉదాహరణ నల్లగొండ జిల్లాలో ఒక రిటైర్డ్ పోలీసు ఇన్‌స్పెక్టర్ తెలుగుప్రధానంగా బి ఎ చేయదలచి దరఖాస్తు పెట్టారు ఆయన వయస్సు 61 సంవత్సరాలు ఈయనకు తెలుగంటే ఇష్టం బాగా చదువుకున్నాడు. బి ఎ అయ్యాక, ఎం ఎ , పి హెచ్‌డి అవుతారు దానికి అన్ని విధాల ప్రోత్సాహమిస్తాము మా విశ్వవిద్యాలయం వల్ల ప్రత్యక్ష ఫలితం చూచారా? అన్న సంతోషంతో భుజాలు ఎగురవేశారు ఆయన

దేశంలో తొలిసారిగా ఏర్పడిన మీ సార్వత్రిక విశ్వ విద్యాలయం విజయవంతం అగుగాక!- అంటూ ఒక చిన్న సూచన చేశాను తెలుగు వారు దక్షిణభారతాన్ని చాల శతాబ్దాలు ఏలారు-కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర చక్రవర్తులు, నాయకరాజులు వీళ్ల కాలంలో వాణిజ్య పరిపాలనాదులకు సంబంధించిన తెలుగు పదాలు ఎన్నో ప్రచారంలోకి వచ్చాయి దక్షిణాపథమంతా వాటిని- అప్పటి వైన తెలుగు పదాలను-ప్రచారంలోకి తేవాలని కోరుతున్నాను తమిళనాడు ప్రభుత్వం అలాటి పదాలను వాడుకలోనికి తెచ్చింది మీరూ అలాగేచేయడం వల్ల భాషాభండారం నిండారుతుంది.- అంటూ సెలవు తీసుకున్నాను అలాగే- అంటూ డాక్టర్ నారాయణ రెడ్డి తక్కిన ఆగంతకులతో సంభాషించడం ప్రారంభించారు

**ఉపశ్రుతి :–**

ఏం కవిగారూ, అలా కుంటుతున్నారేమిటి?- అనడిగాను కొంచెం ఇబ్బందిగా నడుస్తున్న ఒక కవి మహాశయుణ్ణి ఆ!! ఏముంటుంది? కాలికి తొడిగిన గండ పెండేరం సీల గుచ్చుకొని వుంటుంది పాపం!- అన్నారు పక్కన ఉన్న ఒక కొంటె కోణంగి

–తిరుమల రామచంద్ర




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor S Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA
27, SEPTEMBER–3, OCTOBER, '85